# 21 లక్షల క్రొత్త వ్యక్తులు గత సంవత్సరం డెట్ బిళ్లను వాడారు

# దీనికి ఒక ప్రబల కారణం వుంది— డెట్ యొక్క ఉజ్వలమైన ఉతుకు

ఇవుడు ముందుకంటే ఎంతో ఎక్కువ మంది డెట్ బిళ్ల యొక్క ఉజ్వలమైన ఉతుకను ఇష్టపడుతున్నారు, వారంటారు; ఇది మిరమిట్ల తెలుపును, ఎంతో ఎక్కువ పొదుపును ఇస్తుంది.

| ఉత్తమమైన డిటర్జెంట్ బిళ్లల వృద్ధి | |
|---|---|
| | క్రొత్త గ్రాహకులు |
| **డెట్ బిళ్ల** | **21,00,000** |
| రెండవ ఉత్తమ బిళ్ల | 14,00,000 |
| మొత్తము 49,00,000 క్రొత్త గ్రాహకులు | |
| మూలం: రిటైల్ స్టోర్ ఆడిట్ రిపోర్ట్: జనవరి-డిసెంబర్, 1979<br>వాడకపు ఆధారం: 1 బిళ్ల, ప్రతి నెల, ప్రతి వ్యక్తి | |

21,00,000 క్రొత్త వ్యక్తులు డెట్ బిళ్లను వాడడం మొదలెట్టారు.
మరి మీరు ?




## డెట్ బిళ్ల

వాడండి
తెలుపును పొందండి

గుర్తుంచుకోండి—

**తల్లి పాలు అన్నిటికన్నా ఉత్తమం**

ప్రకృతి యిచ్చే యీ వరానికి బదులుగా మరొకటి లేదు. అందుకే, వీలైనంత వరకూ పాపకు మీ పాలే యివ్వండి. అయితే, మీరిచ్చే చనుబాలు గనక సరిపోకపోతే, అమూల్‌స్ప్రే యివ్వడం మొదలెట్టండి.

**మొదటి నుంచీ అమూల్‌స్ప్రే యివ్వండి—అన్నిటికన్న జనాదరణ పొందిన శిశు ఆహారం**

అమూల్‌స్ప్రేకి దానికి కాగల ప్రత్యేకతలు :

- ఖచ్చితంగా సంతులితమైనది
- విటమినులతో నిండినది
- సులభంగా జీర్ణమౌతుంది
- సులభంగా కరుగుతుంది






# అమూల్‌స్ప్రేతో అభివృద్ధి మొదలౌతుంది దానిని బాల్‌అమూల్ పరిపూర్ణం చేస్తుంది






3వ నెల నుంచీ

**బాల్ అమూల్ కూడా యివ్వండి అత్యంత పుష్టికరమైన, పాలతో కలిసిన సీరియల్ ఆహారం**

3వ నెలనుంచీ, పాప ఎంత వేగంగా పెరుగుతాదంటే, పాప బరువు పుట్టినప్పటికన్నా రెట్టింపు అవుతుంది, మరి 3 ఏళ్ళ కల్లా పాప మెదడు 80% దాకా వృద్ధి చెందుతుంది. అందుకే కేవలం పాలు మాత్రం యిస్తే చాలదు. పాపకు ప్రోటీను, విటమినులు, ఖనిజ పదార్థాలూ ఎక్కువగా, అదీ బాగా సంతులితమైన రూపంలో అందాలి. అవి కేవలం బాల్అమూల్‌లోనే అన్నిటికన్న ఉత్తమమైన రూపంలో లభిస్తాయి.

**బాల్అమూల్ మన దేశంలోని శిశువుల కోసం ప్రత్యేకంగా తయారైంది.**

బాల్అమూల్, సెంట్రల్ ఫుడ్ టెక్నలాజికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌వారి సహాయంతో—వెల్లూరు క్రిస్టియన్ మెడికల్ కాలేజివారిచే పరీక్షింపబడినది.

**బాల్ అమూల్‌లో మరింత పోషణ గల విలువ.**

- ప్రాంతు చేయబడిన యితర మన ఆహారం, సీరియల్ ఆహారాల కంటె కనీసం 25% హెచ్చు ప్రోటీను.
- మరింత హెచ్చు కాల్షియం, విటమిన్ ఎ మరియు డి.
- కొవ్వు పదార్థాలు, ఇనుము; మరియు విటమిన్ బి కాంప్లెక్స్‌తో యిది పటిష్ఠం చేయబడినది.
- ముందుగానే పాలతో వండబడినది, తేలికగా అరుగుతుంది, రుచిగలది.
- పప్పు, పండ్ల గుజ్జు, పుడ్డింగ్ మొదలైన వాటితో సులభంగా కలుస్తుంది.

**బాల్ అమూల్‌తో మీరిచ్చే డబ్బుకు రెట్టింపు విలువ అందుతుంది.**

ASP-AB-5/79

**ఉచితం:** సమాచారం గల అమూల్ బేబీ బుక్ మరియు బాల్ అమూల్ గ్రోత్ రికార్డ్ బుక్‌లెట్ ఇంగ్లీషులోనూ, అమూల్ బేబీ బుక్ హిందీ, తమిళం, తెలుగు మరియు మళయాళంలో కూడా దొరుకుతుంది. వాటి కోసం పోస్టు బాక్స్ నం 10124, బొంబాయి 400 001 కి, మీ పూర్తి చిరునామాతో బాటు రూ. 1.00 పోస్టేజి స్టాంపులను పంపండి.



విక్రయదారులు : గుజరాత్ కోఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్, ఆనంద్.

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1906

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938--1972]

శుక్రవారం : 12--9--'80
రవుద్రినామ సం. భాద్రపద శు. తదియ
సంపుటము 73 : సంచిక 55

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 49-40
ఆరు మాసాల చందా రు. 24-70
విడి ప్రతి వెల 90 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక



## వేపాకు మహిమ !

కల్నీ అనే వూరుకు చెందిన 40 ఏళ్ల చమన్ లాల్ అనే ఆయనను ఆగస్టు తొమ్మిదో తేదీ నో నాగుపాము శక్తివంచన లేకుండా కాటేసి గిలాగిలా కొట్టుకుని, తానే చనిపోయిందట. దీనికి కారణం ఏమిటని ఆశ్చర్యపోతే చమన్ లాల్ తాను గత ఇర వయ్యేళ్లుగా రోజూ ఉదయాన్న కాస్త వేపాకు తింటున్నట్టూ, అందువల్ల తనకు విషం ఎక్కదనీ ప్రకటించారట. ఆయన తన పిల్లలకు కూడా వేపాకు తినిపిస్తున్నట్టు ప్రకటించారట.

## కరాటే ప్రణయం !

మద్రాసుకు చెందిన ఎస్.ఐ.ఇ.టి. కాలేజీలో బి.ఎ. చదువుతున్న బిందుశ్రీ అనే ఆమె 29 ఏళ్ల సుందర కుమార్ అనే అతనివద్ద గత నాలు గేళ్లుగా కరాటే నేర్చుకుంటోందట. ఏప్రియల్ నెల 21వతేదీ ఆమె, ఆ కరాటేమాస్టరూ మద్రాసు సిమియం సబ్ రిజిస్ట్రార్ ఆఫీసులో రిజిస్టరు వివాహం చేసుకున్నారట. ఆ తరువాత ఆమెతండ్రి కన్నప్ప నాయుడు ఆమెను ఇటు కాలేజీకిగానీ, అటు కరాటేకిగానీ పంపలేదట. చట్టబద్ధంగా తాను వివాహం చేసుకున్నాననీ, తన భార్య బిందుశ్రీని ఆమె తల్లితండ్రులు నిర్బంధించారనీ కరాటేవీరుడు సుందరకుమార్ కోర్టుకు ఫిర్యాదు చేశాడట. చాలా పెళ్లిళ్లు జరిగాకనే అయ్యో ఎందుకు చేసుకున్నాం బాబూ అని అనిపిస్తాయో ఏమో! దిగితేగాని లోతు తెలియదుగదా!

## అనాధపై అత్యాచారం !

రామనాథపురానికి చెందిన 22 ఏళ్ల మురుగేశ్వరి తండ్రి చనిపోయినందువల్ల ఆమె తల్లి వేరె ఎవనితోనో లేచిపోయి, మురుగేశ్వరిని అనాథ చేసిందట. పెత్తండ్రి కొడుకు సెల్వరాజు ఇంట్లో ఆమె తల దాచుకుని కూలి పని చేసుకుంటోందట. ఆమె, సెల్వరాజు ఒకనాడు మధుర చూడాలని బయలు దేరి వచ్చి, తిరుపరకుంద్రం చూసి 16వ తేదీ రాత్రి తొమ్మిదిగంటలవేళ నో మండపంలో కూర్చుని ఉండగా నో అరడజనుమంది కామోన్మత్తులు సెల్వ రాజును కాళ్లూ చేతులూ విరిచి కట్టిపడేసి మురు గేశ్వరిని ఆరుగురూ చెరచి తమ కామదాహం తీర్చుకున్నారట.

## రైళ్లలో ఆడదొంగలు !

ఆంధ్రప్రదేశ్ హైదరాబాద్‌కు చెందిన లక్ష్మి అనే ఆవిడ మంగమ్మ అనే ఇంకో ఆమెతో చేరి రైళ్లలో చాలా చాకచక్యంగా చక్కని దొంగతనాలు చేస్తూ లక్షలకు లక్షలు గడిస్తున్నారట. వీరిద్దరూ



లోకంపోకడ * ఊమెన్









# ఫాలాక్షుని డైరీ

ఆడవారి పెట్టెలో రాత్రిపూట ప్రయాణాలు చేస్తూ, అంతా నిద్రపోయినాక ప్రయాణీకుల పెట్టెలు మారుతాళాలతో తీసి బట్టాపాతా, నగదూ గట్రా సర్దుకుని, ఆనక మెళ్లో నగలూ, చేతుల గాజులూ ఒలుచుకుని నెమ్మదిగా జారుకుంటూ రట. వీళ్లిద్దరూ యీ విజయ యాత్ర కన్యాకుమారి నుంచి బొంబాయివరకూ అనేకసార్లు చేశారట. లక్ష్మి అనే ఆవిడ యిద్దరుపిల్లలు కెనడాలో చదువుకుంటున్నారట. ఇటీవల వీరిని ఆంధ్ర, తమిళనాడు పోలీసులు కలిసి టక్కున పట్టేశారట.

కడుపునొప్పి — ఆత్మహత్య!

కుప్పూరుకు చెందిన 35 ఏళ్ల నాగలింగం అనే అతని భార్య 20 ఏళ్ల చిన్నపాపఅనే ఆమెకు కడుపు నొప్పివచ్చి, ఆ కడుపునొప్పి [illegible] ంగా మెలికలు తిరిగిపోయేదట. ఎన్ని వైద్యాలు చేయించినా యిది సరిపడనందుపిల్ల తన నీర్ణర్థంకొడుకుతో సహా పరాయి వాళ్ళ నూతిలో దూకి ఆత్మహత్య చేసుకున్నదట. పైస్సేంజేస్తున్నట్టు!

అక్రమ వ్యాపారుల అఘాయిత్యం!

తమిళనాడులో మద్యనిషేధ కార్యక్రమాలు చాలా బలంగా తయారవుతున్నాయి. ఆమధ్య సేలంలో ఓ పెద్ద హోటలు మీద అనుమానంతో పోలీసు శోధన జరిగింది. షరబత్ అమ్మే నెపంతో మద్యాన్ని అమ్మే కొందరిని సేలంలో పట్టుకున్నది పోలీసు. మద్రాసు వస్తున్న గ్రాండ్ట్రంక్ ఎక్స్ప్రెస్ రైలును సూళ్ళూరుపేటలో మొన్న 14వ తేదీన ఆపి మద్యాన్ని ధైర్యంగా ఎక్కిస్తున్నవాళ్లను అడ్డుకున్న పోలీసును కత్తితో పొడిచారటా అక్రమ వ్యాపారులు. తత్ఫలితంగా పోలీసులు కాల్పులు జరిపితే యిద్దరు చనిపోయారట.

తల్లిని చంపిన తనయుడు!

చెట్టివూంకురుబ్బి అనే గ్రామానికి చెందిన 22 ఏళ్ల కాళియప్ప తల్లిదండ్రులను వేధించి అప్పులు చేయించి మరీ పెళ్లి చేసుకున్నాడట. ఆనక అప్పుల వాళ్ళు అతని తల్లిదండ్రులను వేధిస్తే అతని తల్లి, "పెళ్లి చేసుకుని ఎంచక్కా కులుకితే పోతుందా? నీ పెళ్లికయిన అప్పులు తీర్చవద్దా?" అని రోజూ వేపించుకు తినేదట. దానితో వోనాటి వాగ్వాదంలో కోపం వచ్చిన కాళియప్ప రుద్రుడై కొడవలితో తన తల్లి తలను నరికి శరీరంనుంచి వేరుచేసిపారేశాడట— వోరి పాపాత్ముడా!

అధికారి వ్యామోహం!

జనవరి ఇరవైతొమ్మిదో తేదీ 1979వ సంవత్సరంలో ముజాఫర్నగర్కు చెందిన కస్సిమెలా అనే చోట నాట్యం చేసిన 'శైలా'మీద మనసుపడి ఆ రాత్రి ఏదో వంక మీద స్టేషనుకు రప్పించి సత్యపాల్సింగ్ అనే పోలీసు అధికారి ఆమెను చెరిచాడట. ఈ విషయం విచారించి, నిర్ణయించడానికి ఒకటిన్నర సంవత్సరం అయినదట!

---

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# 1980 దీపావళి కథలపోటీ

## మొత్తం రు. 5000 ల బహుమతులు

**ఈసారికూడా దీపావళికి కథానికలపోటీ పెడుతున్నాము... పోయినేడాదిలాగే యీ ఏడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఐదు కథలను ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలో వేస్తాము. అటు తరువాత పాఠకుల బ్యాలట్ నిర్వహిస్తాము.**

## ముగింపు తేదీ 15-9-'80 సోమవారం

పోటీలో ఎన్నికైన ఐదు కథలకు ఒక్కొక్కదానికి రు. **600** లు చొప్పున బహుమతులు యిస్తాము. అటు తరువాత బ్యాలట్లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన మూడు కథలకు రు. **600**, రు. **500**, రు. **400** ల వంతున అదనపు బహుమతులు యివ్వడమే గాక మిగిలిన రెండు కథలకు రు. **250** ల చొప్పున కన్సొలేషన్ బహుమతులను అందజేస్తాము.

★ 'కథానిక' ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నాలుగు పేజీలు మించకుండా వుండాలి. 12 అరటావులు దాటకుండా వ్రాస్తే చాలు. నిడివి ఎక్కువ అయిన కథలకు బహుమతి రాగల అవకాశాలు చాలా తక్కువ అని గమనించాలి.

★ కథావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి.

★ అనువాదం, అనుసరణ, అనుకరణ, కాపీ కథలు పంపకూడదు. ప్రసారమైన, ప్రచురణ అయిన లేదా ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో వున్న కథలు అసలే పంపకూడదు.

★ పై అంశాల మేరకు హామీ పత్రం ప్రతి కథతోపాటు విధిగా వుండి తీరాలి. కలంపేరు వాడినా అసలు పేరు, యింటిపేరు సహా పూర్తిగా విడిగా స్పష్టంగా పూర్తి చిరునామాతోపాటు అందిన కథలనే పరిశీలించ వీలవుతుంది.

★ కథలతోపాటు రచయితల పేర్లు పడవు. బ్యాలట్ తరువాత వారి పరిచయం తోనే వేస్తాము

★ రచనలపై పేచీలు వస్తే రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది.

★ పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫొటో, జీవిత విశేషాలు మొదలైనవాటిని పంపి వాటి ప్రచురణకు అంగీకరించాలి.

★ ముగింపు తేదీ దాటిన తరువాత అందిన కథలను మామూలు ప్రచురణకు వీలువెంబడి పరిశీలిస్తాము

పోటీకి పంపిన కథలను ఏటి పరిస్థితులలోను తిప్పి పంపలేము

సం॥

సీరియల్

# జీవితగమ్యం

## శ్రీమతి యర్రగుంట్ల వరలక్ష్మీదేవి

జరిగినకథ 13 విమలమ్మ భర్త గోపాలం బ్యాంకులో చీఫ్ అకౌంటెంటుగా పని చేస్తుంటాడు. వీరి పిల్లలు భాస్కర్, కోమలి. గోపాలం బావ రాఘవరావు విలాసపురుషుడు. ఉద్యోగంలో చేరిన దగ్గర్నుండి గోపాలం కూడబెట్టిన డబ్బును, వ్యాపారంలో నష్టమొచ్చిందనే నెపంతో రాఘవరావు నోటు వ్రాసి తీసుకుంటాడు. గోపాలం అన్న బలరాం కూతురు లక్ష్మి రామునాయుడిని ప్రేమిస్తుంది. అతనితో 'లేచి'పోతూ ఉత్తరం వ్రాసిపెట్టి పోతుంది. ఓ యాక్సిడెంట్‌లో గోపాలం పోతాడు. అతనికి వెనుక తను వ్రాసిచ్చిన నోటును అపహరిస్తాడు రాఘవరావు. విమలమ్మ ఇంట్లో తన కుటుంబంతో అద్దెకుంటున్న ధనంజయరావు ఆమెను బలాత్కారం చేయబోగా, అతనిని ఇంటినుండి గెంటివేస్తుంది. మొదట్నుంచి అనుకుంటున్నట్లుగా, తన కూతుర్ని కోమలిని శేఖర్‌కిచ్చి మేనరికం చేద్దామని అడగడానికి వచ్చిన విమలమ్మను రాఘవరావు అవమానిస్తాడు. తన మేనమామ విశ్వనాథం కూతురు సరోజని కాదని, తమ ప్రక్క వాటాలో అద్దెకుంటున్న జనార్ధనస్వామి కూతురు శ్రీదేవిని ప్రేమించి పెండ్లి చేసుకొని ఆమె ద్వారా టాటా నగర్‌లో వచ్చిన ఉద్యోగంలో చేరాడు భాస్కర్. బలవంతం చేయబోయిన సత్యానికి తగినబుద్ధి చెబుతుంది కోమలి. తన పెద్దకొడుకు ఇంజనీరు శేఖర్ విషయంలో రాఘవరావు పెంచుకున్న ఆశలు అడుగంటిపోతాయి. అతను పైసాకట్నం తీసుకోకుండా ఇన్‌కంటాక్స్ ఆఫీసర్ [illegible]శ్వరయ్య కూతురు జానకిని ప్రేమించి పెండ్లి చేసుకొంటాడు. ఆమె తన భర్త తరఫు వాళ్ళనిగాని, చివరకు అత్తమామలను కూడా ఆదరించి ఇంట్లో ఉండనిచ్చేదికాదు. రామచంద్రయ్య కొడుకు కృష్ణమూర్తితో కోమలి పెండ్లి నిశ్చయమైన తరువాత, కొన్ని అనివార్య కారణాలవల్ల ఆ సంబంధం చెడిపోతుంది. ఆ తరువాత కృష్ణమూర్తితో సరోజ పెండ్లి జరుగుతుంది. కూతురు పెళ్ళి ఆగిపోయిందనే దిగులుతో విమలమ్మ చనిపోగా కోమలిని భాస్కర్ తనతో తీసుకువెళ్తాడు. అక్కడ శ్రీదేవి కోమలిని నానాబాధలూ పెడుతూ వుంటుంది. శ్రీదేవి చెప్పే ఇంటి పనులు చెయ్యలేక ఆమెను నిదురించి, ఆ ఇంటినివదిలి తన పెదనాన్న బలరాం కొడుకు ప్రభాకరం ఇంటికి చేరుకుంటుంది కోమలి. కోమలికి కాకినాడలో ఉద్యోగం రాగా వెళ్ళి జాయిన్ అవుతుంది. అక్కడ ఆమెకు మాలినితో పరిచయమేర్పడుతుంది. మేనేజర్ మోహనరావు అసలురూపం మాలిని ద్వారా తెలుసుకొని తగు జాగ్రత్తగా వుంటుంది కోమలి. కోమలిని 'రేప్' చేయబోయిన మోహనరావుని తన్ని ఆమెను రక్షిస్తాడు సత్యం.

*(గత సంచిక తరువాయి)*

"బావా! నువ్వా ఇంటికి ఆనాడు ఎలా వచ్చావు? ఎందుకు వచ్చావు?"

తను హోటల్లో ఫలహారం చేసి, అప్పుడే హోటలు నుండి బయటకు వచ్చి, కోమలి రిక్షాలో వెళ్ళిపోవడం చూసేనని, కోమలితో మాట్లాడాలన్న కోరికతో ఎలా తను మరో రిక్షాలో వెంబడించిందీ చెప్పాడు.

"నువ్వు ఈ ఊరులో ఉన్నావని నాకు తెలియదు. కొన్నాళ్ల తర్వాత టాటా నుండి పార్వతీపురం వెళ్ళేవని మాత్రం తెలుసు. అక్కడే ఏదో ఉద్యోగం చేసుకుంటున్నావు అని అందరం అనుకుంటున్నాము. మాకు మీగు అంత ఉత్తరప్రత్యుత్తరాలేవి లేవు కదా. అందుకే నిన్నీ ఊరులో రిక్షాలో చూసి ఆశ్చర్యపోయాను. ఈ ఊరులో నువ్వేం చేస్తున్నట్టు, అన్న ప్రశ్న కలిగింది."

"నా విషయం దేనికిగాని నువ్వు బావా— మామయ్య, అత్తయ్య క్షేమమేనా?"

"నాన్న, అమ్మ నాదగ్గరే విశాఖలో ఉన్నారు. నేను మోటారు పనంతా నేర్చుకున్నాను. శ్రీకాకుళంలో ఆ చిన్నపట్నంలో మెకానిక్కుగ ఉండిపోవడం ఇష్టంలేక అభివృద్ధి చెందుతున్న విశాఖపట్టణంలో ఓ ఆటో రిపేరు షాపు పెడితే బాగుంటుందని ఊహకల్గి, స్టేటు బ్యాంకు వారి దగ్గర స్వయం ఉపాధి కల్పనకి సహాయంగా ఓ పది వేలు అప్పు తీసుకున్నాను. ఇంతలో విశాఖలో ఉన్న మీ మేనత్త రెండో కొడుకు మురళి కలిసాడు. వాడు కామర్స్‌లో ఇంటర్ చదివి, చదువుతో విసుగెత్తి ఏదైనా వ్యాపారం చేదామనే ఉద్దేశంతో ఉన్నాడు.

అన్నట్లు నీకు తెల్సునో లేదో పాపం రాఘవరావుగారు ఇప్పుడు జైల్లో ఉన్నారు. స్మగ్లింగ్ చేసిన వాచీలు, బ్రాండీ సీసాలను కొని చాటుగ వ్యాపారం చేస్తున్నందుకు, స్మగ్లింగును ప్రోత్సహిస్తున్నందుకు— ఇన్‌కమ్ టాక్సును ఎగవేసినందుకు అతని మీద కేసును పెట్టి ఆ షాపును మూయించి అతడ్ని జైలుకి పంపారు. ఆ పెద్దవాడు శేఖర్ భార్యాలోలుడు. వాళ్ళ కుటుంబ విషయాలు యేమీ పట్టించుకోడు. మీ మేనత్త చాల అమాయకురాలు. అందుచేత ఆ కుటుంబ భారమంతా మురళి తనమీద వేసుకున్నాడు.

మురళి చాల బుద్ధిమంతుడు. మే మిద్దరంకలసి డాబా గార్డెన్సులో ఓ రిపేరు షాపు పెట్టేం. అందులో కార్లను, స్కూటర్లను మరమ్మత్తు చేస్తాం. దానికి అనుబంధంగ వాటికి కావల్సిన భాగాలను అమ్మే ఓ దుకాణాన్ని ఆ షాపు ప్రక్కనే ఈమధ్యే తెరిచాం. నలుగురు పనికుర్రాళ్లను పెట్టాం. మురళి సామాన్లు అమ్మే షాపు చూసుకుంటాడు. నేను రిపేరు షాపు చూసుకుంటున్నాను. మురళికి కూడా ఈ ఆటో పనిలో శిక్షణ ఇస్తున్నాను, ఇద్దరు మెకానిక్కు లుంటేగాని పని నడవదని. ఇలా మూడేళ్లనుంచి వ్యాపారం చేస్తున్నాం. ఈ సరికే బ్యాంకు అప్పు నాలుగు వేలు







అధిక దిగుబడి ప్రతి పైరునుండి ప్రతి సారి పొందాలంటె మీ భూమిలో సారం అధికంగా ఉన్నప్పుడు మాత్రమే సాధ్యమవుతుంది.

మీ భూసారం అధిక స్థాయిలో ఉండేందుకు ఈ క్రింది పద్ధతులు అవలంభించండి.

1. సిఫార్సు ప్రకారం నత్రజని, భాస్వరం, పొటాసియంలను విజయ్ ఎరువుల ద్వారా అందించండి.

మోతాదు (ఎకరాకు కిలోలలో)

| పైరు | దుక్కిలో విజయ్ 17-17-17 | పైరుమీద విజయ్ యూరియా |
|---|---|---|
| ప్రత్తి | 120 | 60 |
| మిర్చి | 150 | 75 |
| పసుపు | 150 | 75 |

2. అధిక దిగుబడులకు విజయ్ ఎరువులను సరిఅయిన సమయానికి సరిఅయిన పద్ధతిలో వేయండి.
3. పసుపుల పెంట, చెత్త చెదారాలను భద్రపరచిపొలంలో కలియ దున్నండి.

ఇంకా వివరాలు కావలిస్తే ఈ క్రింది చిరునామా నుండి పుస్తకాలు తెప్పించుకొని తెలుసుకోండి.

VIJAY
MADRAS FERTILIZERS

ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44, శాంతినగర్,
హైదరాబాదు-500 028









నాణ్యమైన, నమ్మకమైన విజయ్ ఎరువులను తయారుచేయువారు
**మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్**
మణలి, మద్రాస్ 600 068

MFL 2268

# జీవితగమ్యం

చెల్లించేసాను. మురళి కూడా తన వంతు ఓ యెనిమిదివేలు పెట్టుబడి పెట్టాడు.

కోమలి! ఈ సత్యమంటే ఏమనుకుంటున్నావు — నేను మునుపటిలా ఒకడి క్రింద పనిచేసే చిన్న మెకానిక్కు కుర్రాడ్ని కాను. ఇప్పుడు నేనే యజమానిని. వ్యాపారస్తుడ్ని, ఆటోమొబైల్ ఇంజనీరుని కూడా'' అని గర్వంగ చెప్తుంటే కోమలికి సంతోషంతో బాటు నవ్వువచ్చింది. మళ్ళీ హాయిగ నవ్వగల్గింది.

''ఎక్కువగ నవ్వకు, తల కదులుతుంది — మళ్ళీ బాధని యెదుర్కొంటావు. ఇంతకీ నవ్వెందుకు వచ్చింది?'' అని మెల్లగ మందలించాడు సత్యం.

''ఏమీలేదు బావా! నేనో పెద్ద వ్యాపారస్తుడ్ని, ఇంజనీర్ని అని చెప్తుంటే నాకు ఆనందం కల్గి నవ్వొచ్చి అంతే — మరేం లేదు. బావా! నాకిక్కడ ఎలాగు ఉద్యోగం ఊడింది. నీ షాపులో నాకేదైన చిన్న ఉద్యోగమైనసరే ఇవ్వలేవూ?''

సత్యం ఒక్కనిముషం ఆలోచించాడు.

''సరే! ఓ పని చేద్దాం — ఆ విడిభాగాలమ్మే షాపుకు సంబంధించిన వ్యవహారాలు నువ్వు చూసుకుంటుండు. నేను, మురళీ నీకు సహాయం చేస్తామనుకో. మేము అడిగే భాగాల పేర్లు చూసి ఆర్డర్లు వేయడం, తెప్పించడం, ఆ ఉత్తరాలు, ఆ ఎకౌంట్సు అన్నీ నువ్వు చూసుకో. జీతం తరువాత నిర్ణయిస్తాం. ఏం, నీకిష్టమేనా?''

''నా కంతకన్నా మరేంకావాలి బావా — తప్పకుండ ఆ ఉద్యోగం చేస్తా. అలాఅయితే ఈ హాస్పిటల్ నుండి విడుదలయిన తరువాత, నువ్వెప్పుడు రమ్మంటే అప్పుడు విశాఖ వస్తాను.''

''అదేం కుదరదు — విస్సిఊరులో వదలి నేను పోను. నీకు ఆరోగ్యం చేకూరగానే నిన్ను నాతో తీసుకువెళ్ళి నీ మామయ్యకు, అత్తకు నిన్ను అప్పచెప్తా. వాళ్ళ సంరక్షణలో నువ్వుండడమే మంచిది. ఏమంటావు?''

''చాల థాంక్సు బావా.''

కోమలి హృదయం ఆనందంతో పొంగిపోయింది.

ఆ రోజు కోమలి ప్రేమగ సత్యం చేతిని తీసుకుని ఆ చేతిని అలా తన చేతితో పట్టుకుని హృదయం మీద వుంచుకుని ప్రశాంతంగ నిద్రపోయింది. సత్యం హృదయంలో ఏదో ఆశ చిగురించింది. కోమలి ముఖంలోకి అనురాగంతో చూస్తూ కూర్చున్నాడు.

మాలిని రాకను సత్యం గమనించలేదు. ఆమె తను తెచ్చిన ఏపిలు పండ్లను టేబిలు మీద పెడుతున్నప్పుడు కల్గిన చప్పుడుకు ఇటుతిరిగి గతుక్కుమని కలలోంచి మేల్కొని తన చేతిని తీసేసుకున్నాడు మెల్లగ. కాని కోమలికి తెలివివచ్చి చూసింది యెదురుగ బెంగతో నించున్న మాలినిని. అప్పుడు మధ్యాహ్నం మూడు గంటలైంది.

సత్యంలేచి గదిబైట వున్న వరండాలోకి పోయేడు. మాలినిని చూడగానే కోమలికి దుఃఖం మరి ఆగలేదు. మాలిని కండ్లు ఆ సరికే వర్షిస్తున్నాయి.

''కోమలీ! ఏ స్థితిలో చూస్తానని అనుకోలేదే — ఏంజరిగిందే?''

మాలినికి నిజం చెప్పడమా, వద్దా — అన్న సందేహంలో పడ్డది కోమలి. ఓ వేళ నిజం చెప్తే మాలిని ఆవేశంతో ఆఫీసులో మోహనరావు దుశ్చర్య అంతా చెప్పి, మోహనరావుని కూడ దులిపేస్తే, అతడు కోపం తెచ్చుకుని మాలిని ఉద్యోగం ఊడబెరుకుతే, మరే ఆధారం లేని మాలిని, మాలిని మీద ఆధారపడ్డ తల్లి, తమ్ముడు, చెల్లి ఏమైపోతారో అన్న భయం కోమలికి కల్గింది. అందుకే మాలిని శ్రేయస్సు దృష్ట్యా నిజం చెప్పకపోవడమే మంచిదనుకుంది.

''ఏమీలేదే — ఆదివారంనాడు విశాఖపట్నం నుండి నా మేనబావ సత్యం వచ్చాడు. మధ్యాహ్నం నేను మా బావ మెయిను రోడ్డులో నడుస్తుంటే త్రాగుబోతు వెధవ ఓ డ్రైవరు వచ్చి కారును నాకు గుద్దించేసేడు. ఆ యాక్సిడెంటు వల్ల ఈ హాస్పిటల్లో వచ్చిపడ్డాను.''

''ఎంతపని జరిగిపోయిందే! ఊహించుకుంటేనే నా గుండెలదరి పోతున్నాయి.''

''మాలినీ! నేనిక్కడున్నానని నీకెలా తెల్సింది?''

''నేను నీ ఇంటికి సోమవారం నాడు వెళ్ళేను, నువ్వెంతకీ ఆఫీసుకు పోవడానికి రాకపోతే. నువ్వు ఆదివారం నుండి ఇంట్లో లేవని ప్రక్కవాటా లలితమ్మ చెప్పింది.

ఆఫీసుకు వెళ్ళాను. ఆ రోజంతా నువ్వు రాలేదు. హెడ్‌క్లర్కు జగన్నాథంగార్ని అడుగుతే తనకేమీ తెలియదని, తన వద్దకు ఈ పూటికీ ఏమీ రాలేదని చెప్పారు. నాకు చెప్పకుండ నువ్వెక్కడికీ పోవని, ఏ ప్రమాదం జరిగిందోనని భయపడుతున్నానని చెప్పాను. జగన్నాథంగారు మేనేజరుగార్ని అడిగివస్తానని అతని వద్దకు వెళ్ళాడు.

మేనేజరు చెప్పిందేమంటే, నువ్వు ఆదివారం నీ బావ ద్వారా నీ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేసినావు, తనకు ఉత్తరం పంపావని, అందుకే ఇకమీదట నువ్వు మరి ఆఫీసుకు రావని చెప్పాడు. ఆ జవాబుతో ఆఫీసులో అందరు బహుశా నీకు పెండ్లవని, అందుకే హఠాత్తుగ ఉద్యోగం వదిలేసి వెళ్ళిపోయేవని అనుకున్నారు."

'అలా అనుకోడం ఒకందుకు మంచిదే."

"కాని నేను మాత్రం తృప్తి చెందలేకపోయాను. ఏదేదో ఊహించుకున్నాను. నిన్న ఎవరో మాటలమీద ఎవరో యాక్సిడెంట్ల గురించి మాట్లాడుతుంటే నాకో ఆలోచన తట్టి హాస్పిటల్‌లోని యాక్సిడెంట్ల వార్డుకు ఫోన్ చేశాను. కోమలి అనే అమ్మాయి ఆదివారంగాని, సోమవారంగాని హాస్పిటల్‌లో చేరిందా అని అడిగాను. వాళ్ళు నీ సంగతి చెప్పి ఈ స్పెషల్ రూములో ఉన్నావని చెప్పారు. వెంటనే అర్ధరోజుకి శలవు పెట్టి ఇలా వచ్చాను. నా మనస్సులో ఏదో భయం ఉండబట్టి ఈ విషయం ఆఫీసులో ఎవ్వరికి నేను చెప్పలేదు."

"మంచిపని చేశారు. నాదో ప్రార్థన. దయచేసి నా సంగతేమీ వాళ్ళకు చెప్పకు. వాళ్ళందరు ఈ హాస్పిటల్ చుట్టూ చేరి నాకు సానుభూతి తెల్పడం నేను భరించలేను. అందుకే నేను విశాఖపట్నంకు నా మేనమామతో వెళ్ళిపోయానని, అక్కడ నా పెండ్లి అతడితో త్వరలోనే జరగబోతుందని చెప్పు."

"ఏమిటోయ్ సంగతి? అతడేనా నీ మేనబావ- లక్కీ గర్ల్‌వే. అతడ్ని చూడగానే నేను సినిమా హీరో అనుకున్నాను."

"సారీ- నీ మాటలన్నీ అలాగే ఉంటాయి."

"ఏం అమ్మాయి! నీకు వద్దనుకపోతే చెప్పేసేయి- నేను ఆ హీరోని తీసుకొని పోయి పెండ్లాడేస్తాను."

"ఇది మరీ బాగుంది. నా హీరోని నీ కివ్వనే భామా."

"వెరీ గుడ్- అయితే ప్రేమ చాలా దూరం పోయిందన్నమాట."

"ఏ దూరము లేదుగాని గట్టిగా మాట్లాడకు. మా బావ విన్నాడంటే సిగ్గుచేటు."

"సరే ఒక్క మాట చెప్పేసేయి- పెండ్లెప్పుడు ?"

"పెండ్లా- ఈ కట్లతోనా? చేతులు లేవు నారాయణ- కాళ్ళు లేవు నారాయణ అన్నట్లుంది నా స్థితి."

చాలా సేపు స్నేహితులిద్దరూ మాట్లాడుకున్నారు. రోజూ సాయంత్రం వస్తానని మాటిచ్చి మాలిని వెళిపోయింది. మాలిని వెళ్తున్నప్పుడు- 'వెళ్ళొస్తాను- సత్యం బావగారూ! కాస్త దయ ఉంచండి' అని సత్యాన్ని కాస్త బెదరగొట్టి మరీ పోయింది. 'పెంకి పిల్ల' అనుకున్నాడు సత్యం.

మరో అయిదు రోజులు గడిచేసరికి కోమలి కట్లు విప్పేసి, హాస్పటల్ నుండి డిస్చార్జి చేసారు. నుదుటిమీదున్న గాయం పై మాత్రం చిన్న ప్లాస్టరు గుడ్డ ఇంకా మిగులుంది. కోమలింటికి ఆమెను సత్యం టాక్సీలో తీసుకు వచ్చాడు. ఇంకా కోమలి బాగా నడవలేక పోతూంది.

రోజూ పాదాలకు మెడికేప్ డాక్టరు చెప్పినట్లు రుద్ది ఫోమంటేషను చేసేవాడు సత్యం. కోమలి వంట చేస్తున్నప్పుడు ఆమెను అక్కడ నుండి కదలనివ్వకుండా అన్ని అందించేవాడు. తనే రాత్రి పాలు వెచ్చచేసి, పడుకునే ముందు త్రాగడానికిచ్చేవాడు. కోమలి ఉన్న ఆ ఒక్క మంచం మీద పడుకుంటే ముందున్న వరండాలో నేలపై చాప వేసుకుని పడుకునేవాడు. సత్యం సంస్కారానికి, వ్యక్తిత్వానికి, పెద్దమనిషి తరహాకు, అన్నిటికీ మించి అతడు చూపే ఆదరణ, అనురాగానికి కోమలి ఎంతో సంతోషించి, సత్యానికి తన హృదయంలో స్థానాన్నిచ్చింది. మానసికంగ తనని తాను అర్పించుకుంది మరే అరమరికలు లేకుండా. ఇప్పుడు కోమలి ప్రపంచమంతా సత్యమే. అటువంటి మంచిమనిషి సత్యంకు భార్య కాగలిగితే అదే తన జీవిత సాఫల్యం అనుకుంది.

వారం రోజుల తరువాత నుదిటిమీదుండే గాయం పూర్తిగా నయమైపోయి, ప్లాస్టరు రాలిపోయింది, కోమలి మళ్ళా మామూలు మనిషి కాగలిగింది. మరే బాధ లేకుండ సహజంగ నడువగల్గుతూంది.

ఆనాడు తలంటు స్నానంచేసి, చక్కని పిల్చుకచీర కట్టుకుని, పెరట్లో పూసిన పూలను దోసెట్లో తీసుకుని వచ్చి సత్యం ముందర నిల్చుంది. సత్యం దేవతాస్త్రీలా నవ్వు ఆ సౌందర్యమూర్తిని చూస్తూ వుండిపోయాడు.

"నన్ను ఆశీర్వదించు బావా" అని వంగి, సత్యం ఆశ్చర్యపోతుండగ తను తెచ్చిన పూలను బావ పాదాల మీద పోసింది. ఆతడి పాదాలను తాకి నమస్కరించింది.

"బావా! నీ పాదాల చెంత నాకింత చోటీయ్యి. నేను జీవితంలో చాల అలసిపోయాను. నీ చెంత నన్ను విశ్రమించనియ్యవూ?" అని ప్రాధేయపూర్వకంగా అడిగింది.

సత్యం హృదయం మధురానుభూతితో నిండింది. మెల్లగ కోమలిని లేవనెత్తి, తన గుండెలకు హత్తుకున్నాడు.

"కోమలి- నీ స్థానం యిక్కడ, పాదాల వద్ద కాదు."

కోమలికి యెన్నడు కల్గని ప్రశాంతత ఆ విశాల వక్షం పై లభించింది.

"కోమలి- రేపే మనింటికి విశాఖపట్నం పోదామా ?"

"నీ ఇష్టం బావా."

అప్పుడే వచ్చిన మాలిని, కౌగిలిలో ఒకటిగనున్న ఆ చక్కని జంటను చూసి ఆనందంతో కండ్లు చెమర్చగ మెల్లగ వెను తిరిగి వెళిపోయింది.

( అయిపోయింది )

**అంకితం**

"సకల జీవులకు వెలుగు నిచ్చి జీవితాన్ని ఓ గమ్యానికి చేర్చే ఆ మహాతల్లి, కాళహస్తిలో వెలసిన జ్ఞాన ప్రసూనాంబకు భక్తితో సమర్పించే నా ఈ చిన్న పుష్పము."

విధేయతతో,

— వై. వరలక్ష్మీదేవి

# వారఫలం

## 12-9-1980 శుక్రవారం మొదలు
## 18-9-1980 గురువారం వరకు

**మేషం :** మీ రాశికి శని గురు, రాహు గ్రహాలు అనుకూల స్థానాల్లో ఉండటం మూలాన, వ్యాపార లాభం. ద్రవ్యాదాయం, అనుకోని విధంగా పాత బాకీలు వసూలు కావటం, వ్యవసాయదారులకు సర్వానుకూలత, ఉద్యోగంలో చాలామందికి ప్రమోషన్ చెప్ప వీలైన గ్రహానుకూలత గలవారం. స్త్రీలకు: సర్వతోముఖాభివృద్ధి గల వారం. ఉన్నత విద్యార్జనకు అనుకూలమైయిన వారం.

**వృషభం:** వారఫలం ఉత్తమమే కాని, సంతాన విద్యాభివృద్ధి విషయంలో అధిక శ్రద్ధ తీసుకొనవలసివస్తుంది. విలువగల వస్తుసేకరణ, విలాస యాత్రార్థం సంభాషణలు గావించటం, బంధుమిత్రులతో ఇష్టాగోష్ఠి జరుపగలవారం. చాలామందికి క్రీడారంగంలో అభివృద్ధి గలదని గ్రహించాలి. స్త్రీలకు : కృషి చేసి అనేక కార్యాలలో లాభం, విజయం సాధించ గలరు.

**మిథునం:** కళారంగంలో మీకు గౌరవకల్గుతుంది. అదృష్టమూలాన ధనాదాయమున్నది. ఉన్నత విద్యార్జనకు చాలామందికి విద్యార్థుల కవకాశమున్నది. ఉద్యోగాభివృద్ధికి మాట చెల్లావణి క్రీడారంగంలో అనుకూలత సంభవించే వారం. విలువ గల వస్తుసేకరణ గావించగల్గుతారు. ముఖ్య బంధువులతో శుభకార్యాలోచనలు జరుపగలరు. స్త్రీలకు: ఉద్యోగాభివృద్ధి, వృత్తిలో అనుకూలత చెప్పదగిన వారం.

**కర్కాటకం:** గత వారానికన్నా, సర్వరంగాలలో మీకు అనుకూలత గలదు. విద్యా వైజ్ఞానికరంగాలలో గౌరవ కనిపిస్తుంది. కళాకారులకు విజయవంతమైయిన వారం. ఉద్యోగంలో శ్రమ కనిపించినా, అభివృద్ధికూడ సంభవం. చాలామందికి, క్రీడారంగంలో ప్రవేశం చెప్పదగి ఉన్నది. అనుకున్న రీతిగావిద్యార్థులకు సీట్లు లభిస్తాయి. స్త్రీలకు: బంధు సమాగమం, తీర్థాటనము గూర్చి ప్రస్తావనలుండగలవు.

**సింహం :** చాలాకాలంగా మీరు గావించే ప్రయత్నం బహుశః ఉద్యోగాన్ని గూర్చి ఈ వారం సఫలం కానున్నది. వృత్తిలో చాలామందికి అభివృద్ధి చేకూరనున్నది. రాశి స్థితులైనవారు, క్రమంగా ఇతర రాశులు చేరుట వలన, హాయి ప్రశాంతత కనిపిస్తుంది. స్త్రీలకు : విద్యార్థినులయితే అభివృద్ధికరమయిన అవకాశాలు చిక్కగలవు. ఆదాయం చాలామంది విషయంలో సంభవము.

**కన్య:** జన్మ రాశిలో గోచార రీత్యా స్థితుడైన శని గ్రహం అనారోగ్యత కల్గించవచ్చు. శరీర విషయంగా జాగ్రత్తవడాలి. కృషిచేసి, ఉద్యోగ వృత్తులలో ఆదాయం సంపాదించండి. వ్యాపారం బాగుంటుంది. మీకు క్రీడారంగంలో విజయం సిద్ధి సంభవం. స్త్రీలకు : అప్రయత్న ద్రవ్యాదాయం, విలాస వస్తువులను సేకరణ చేయ గలదు.

**తుల :** ఈ వారంలో మీరు, వ్యాపారరీత్యా లాభం, శుభం, ఆనందం, హాయి అనుభవించనున్నారు. స్వశక్తిపై ఆధారపడిన మీకు ఏ రంగంలోన అవకాశం చిక్కదు? ఎటుటా ద్రవ్య ప్రాప్తి కనిపించదు? కృషి చేయండి. వ్యయం అధికమైనా, ఆదాయం కూడా ఉన్నది. స్త్రీలకు: కళారంగంలో, క్రీడారంగంలో, విద్యారంగంలో చాలా మందికి అనుకూలత చెప్పదగిన వారం.

**వృశ్చికం:** ఈవారంలో, మీరు పరులతో సంబంధ బాంధవ్యాలు పెంచుకోవాలి. ఎంతగా ప్రాధేయపడినా, బంధువులకుగాని,మిత్రులకు గాని, అప్పు లిచ్చే పద్ధతి ఎంతమాత్రము తగదు. చేయి దాటితే తిరిగి రాదు. శుభకార్య ప్రస్తావన ఉండగలవు. స్త్రీల మూలాన ఇబ్బందులు,ఇరుగు పొరుగువారితో గొడవలుంటాయేమో చూసుకోండి. స్త్రీలకు : అధికార్యాభివృద్ధి, ద్రవ్యాదాయం సంభవం.

**ధనుస్సు:** బహుముఖంగా అవకాశాలందుకోగలరు. చాలామందికి క్రీడారంగంలో అవకాశాలుంటాయి. ఈ వారపు గ్రహచార రీత్యా, ఇతరుల సహకారంతో, వ్యాపారరీత్యా, ఉద్యోగరీత్యా అభివృద్ధిని పొందనున్నారు. సాంఘిక ప్రయత్నాలు ఫలవంతం కాగలవు. వ్యయం అధికంగా సూచింపబడే వారం. స్త్రీలకు: విద్యాభివృద్ధి విషయంలో, ఆదాయం విషయంలో సర్వానుకూలత గల వారం.

**మకరం :** కృషిచేయండి.మీ మనోభీష్టం, పత్రికా ప్రకటనలో, విలువగల వస్త్రసేకరణలో,సంఘసేవలో మీకు అనుకూలత గలదు. పల్గురితో కూడిన వ్యవహారంలో మీకు వ్యయ సూచన గలదు. స్త్రీలకు : క్రీడారంగంలో, చాలామందికి విద్యార్థినులకు విద్యా వైజ్ఞానిక రంగంలో సర్వానుకూలత గల వారము.

**కుంభం:** తలంచిన కార్యం వెంటనే జరగాలి. ప్రయత్నించిన కార్యం విజయవంతంగా సాగాలి. ఉన్నతాధికారం సంక్రమించాలి. సభాగౌరవం, పత్రికా గౌరవం అభిలషించే మీకు, ఈ వారం సర్వత్రా విజయసిద్ధిని కలిగించనున్నది. ఇంతకూ గ్రహబలం అనుకూలమనే చెప్పాలి. స్త్రీలకు : కళారంగంలో, విద్యారంగంలో మంచి ఫలితాలు ఉండగలవు.

**మీనం:** అనేక విషయాలు, మీకు లాభదాయకం అయినవి సఫలమయ్యేందుకు గ్రహానుకూలత గలదు. మీకు రహస్య శత్రువులున్నారు. జాగ్రత్త! ఒక కంట పాదిని కనిపెట్టి చాలా జాగ్రత్తగా మెలగితే, మీ పనులకు ఆటంకాలు రావు. స్త్రీలకు : విద్యాభివృద్ధి, వయోవృద్ధులకు ఆరోగ్య భంగం, ఉత్సాహవంతులైన యువతులకు ఉల్లాస యాత్ర సంభవం.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# అన్నిటికన్నా తక్కువ ధరకు
# అన్నిటికన్నా ఎక్కువ శుభ్రత




ఇతర అన్ని డిటర్జెంట్ బార్లకంటే ఎంతో ఎక్కువ ఉత్తమమైనది, ఎంతో ఎక్కువ ఆదానిచ్చేది మరియు సబ్బులకంటే 1½ రెట్లు ఎక్కువ శక్తివంతమైనది.

## నీలి రంగు 卐 స్వస్తిక్
## డిటర్జెంట్ ఉతుకే బార్

ఒక మారు స్వస్తిక్ బార్...మరి ఎప్పటికీ స్వస్తిక్ బార్



# అవగాహన

కప్పగంతుల మల్లికార్జునరావు

అవధాని క్రియాశీల రాజకీయ నేత కాదు. కానీ ఒకానొక రాజకీయపార్టీ సిద్ధాంతానికి భాష్యకారుడు. ఆ పార్టీ నాయకులు అయన్ని మహర్షిలా భావించి గౌరవించేవారు.

కాలక్రమాన రాజకీయ నేత లంతా ధనవంతులయ్యారు. నొక్కగా నొక్క కూతురు మలయవాసినికి వివాహం చేయటం కష్టమయినప్పుడు అవధాని పెంచుకొన్న సిద్ధాంత భ్రమలు తొలగిపోయాయి.

ఒకప్పుడు తండ్రి వాడిన కొన్ని పడిగట్టు పదాలని మలయవాసిని చిలకలా నేర్చుకొంది. తండ్రి వాగ్ధాటి అబ్బింది. చిన్నపాయింటు పుంజేచాలు—సాలెగూడులా ఆ పాయింటు చుట్టూ పెద్దగూడు అల్లి ప్రత్యర్థిని [illegible] వేస్తుంది. అవధాని ఆమె ధోరణి [illegible]లని ప్రయత్నించాడు. కాని సాధ్య[illegible] లేదు. తండ్రిలాగా తానూ గొప్ప మేధావినని ఆమె గర్వం!

అలాంటి స్థితిలో రామ్‌మోహన్‌రాయ్ మలయవాసిని ప్రేమించి పెళ్ళి చేసుకోటానికి సిద్ధమయ్యాడు.

రాయ్‌ది ఆ వూరే. ధనవంతుడు. అతని తండ్రిని అవధాని విమర్శించేవాడు. మలయవాసినికి కూడా ఐశ్వర్యం వున్న ఆ కుటుంబం అంటే మంట.

అంచేత మలయవాసిని అతను పెళ్ళి చేసుకొంటాననగానే చిటికె గంటేసి అతని నోళ్ళో వాలిపోలేదు.

'అసలు ఈ వివాహ వ్యవస్థను గురించి మీ అభిప్రాయం ఏమిటి ?'

రాయ్ రాజకీయాలు మాట్లాడడు. భావుకుడు. సంస్కరణాభిలాషి. పుస్తక పఠనం అతనికున్న గొప్పహాబీ.

మలయవాసిని ప్రశ్నకి అతను చిరునవ్వు నవ్వేడు. సమాధానం ఇవ్వలేదు. మలయవాసిని అతనిమీద దండయాత్ర చేసింది.

'ఈ బూర్జువా వివాహ వ్యవస్థ నిజానికి సమిష్టి పెండ్లాల వ్యవస్థ. బహిరంగ వేశ్యావృత్తి, ప్రచ్ఛన్న వేశ్యావృత్తి ఈ సమిష్టి పెండ్లాల వ్యవస్థలో అంతర్భాగాలు. మీకు తెలిదేమో. బూర్జువాకు తన భార్య కేవలం వుత్పత్తి సాధనంగా మాత్రమే కన్పిస్తుంది. ప్రస్తుత వుత్పత్తి వ్యవస్థ సమూలంగా నిర్మూలింప బడితే తప్ప ఈ స్థితిలో మార్పురాదు. స్త్రీకి సరైన గౌరవ ప్రపత్తులు, సామాజిక న్యాయం, భద్రత చేకూరదు. ఏమంటారు ?'

అనవసర వాగ్యుద్ధాలంటే యిష్టంలేని రాయ్ ఏమీ అనలేదు. అతని మౌనం అతని బలహీనతగా, అజ్ఞానంగా భావించి మలయవాసిని మరో అస్త్రాన్ని విసిరింది.

"అందుకే శాస్త్రీయ అవగాహన అవసరం అని నేను మొత్తుకొనేది. డబ్బు, డిగ్రీలు వున్నంతమాత్రాన శాస్త్రీయ అవగాహన అలవడదు"

'అనేదో అవగాహన లేకపోతే పెళ్ళి చేసుకోకూడదా? యిదెక్కడిధర్మశాస్త్రం?' రాయ్ మెల్లగా అన్నాడు.

పంథొమ్మిది వందల డెబ్బై ఏడు ఎన్నికల ఫలితాలు ప్రకటన అవుతున్నప్పటి ఇందిరాగాంధీ అయ్యింది మలయవాసిని రోషణం! ఆ తర్వాత మరింత తారస్థాయిలో తీవ్రంగా అంది.

'శాస్త్రీయ అవగాహన లేనంతకాలం పురుషుడు భార్యను బానిసలా చూస్తాడు. స్త్రీకి సంఘంలో గౌరవ ప్రపత్తు లుండవు.'

'నేను నా భార్యను బానిసలా, ఉత్పత్తి సాధనంలా చూడను. సాటి మనిషిలా—చేతనామూర్తిలా చూస్తాను'

'పెళ్ళి కాకముందు ప్రతిమగాడూ చెప్పే కబుర్లేయివి. సమాన హక్కులిస్తారా స్త్రీకి ?'

'యిస్తాను. కాని హక్కులన్న ఆలోచన కూడా బూర్జువా సృష్టే ననుకొంటాను?'

నివ్వెరపో[illegible]ందతని ప్రశ్నకు !

'అందుకని హక్కులన్నీ మీ గుప్పిట్లో పెట్టుకొని స్త్రీని అణగ దొక్కుతారా ? పతివ్రతా ధర్మాలు చెప్పి నిర్వీర్యురాలిని చేస్తారా ?'

'నా భార్యను నేను గౌరవిస్తాను'







మీరు యింకా
ఏ యితర
ఖర్చులకు
ఆలోచిస్తున్నారు

# మీకు అందించిన దానికొరకు కెనరా బ్యాంకును సహాయము చేయనీయండి

భవిష్యత్తులో మీరు తలపెట్టిన పెద్ద ఖర్చులనైనా నగము ఖర్చు కెనరా బ్యాంకు భరిస్తుంది. మీరు ముందుగా ఆలోచించి పొదుపు వేసిన ప్రతిదీ మీకు అందుబాటులోనే వుంటుది. మీకు రాబోయే యే విధమయిన ఖర్చులకుగాను సహాయముచేయుటకే కెనరా బ్యాంక్ ప్రత్యేకమయిన ప్రణాళికలను కలిగియుంది.

ఎన్నాళ్ళనుంచో కోరుకొంటున్న మోటారుకారా! స్కూటరా! స్వంతయిల్లా! మీ బిడ్డకి వున్నత విద్యయా! లేక పెళ్ళా! కామధేను పొదుపు ప్రణాళికలో మీ డబ్బును కాలపరిమితిలో ఎక్కువ వృద్ధిపొందును.

ఈ ప్రణాళికలోని గొప్ప విశేషమేమనగా మీకు కావలసిన మొత్తములో కొద్దిభాగమును పొదుపు పరచుటయే. పొదుపుపరచు మొత్తమును, నెలల సంఖ్యను మీరే నిర్ణయించుకొనండి. దానిమీదనుండి వడ్డీమీద వడ్డీయే మీకు నెలనెలా మంచి రాబడి, మరియు మీ డబ్బు రెండింతలకు పైగా వృద్ధిపొందుతుంది.

మీ దగ్గరలో నుండు కెనరా బ్యాంక్ శాఖకువెళ్ళి వివరములు తెలుసుకొనండి

మా యితర ప్రత్యేక ప్రణాళికలు: విద్యానిధి నిరంతర బాలక్షేమ.

## కామధేను పొదుపు

## కెనరా బ్యాంక్




కెనరా బ్యాంక్ (జాతీయ బ్యాంక్)
దేశము మొత్తమున 1200కు పైగా శాఖలు కలవు.

maa CB 5 Tel B 80

# కలకత్తాలో భూగర్భ రైల్వే మార్గం నిర్మాణం

కలకత్తా సబ్‌వే నిర్మాణంలో వేలాదిమంది కార్మికులు పనిచేస్తూ వున్నారు. భూగర్భ రైల్వేస్టేషన్లు, సొరంగ మార్గాలు, వివిధ అనుబంధ సౌకర్యాల డిజైన్లను యీ నిర్మాణ వ్యవహారాలను చూస్తున్న భారతీయ ఇంజనీర్లు, సాంకేతిక నిపుణులు రూపొందించారు.

ఒకటి, రెండు చెదురు మదురు మార్గాలను నిర్మించడం కంటె ఒకేసారి ఐదు భూగర్భ రైల్వే మార్గాలను నిర్మించడం సముచితంగా వుండగలదని, భవిష్యత్తులో దీనికి ఒకే భూగర్భ రవాణా సముదాయంగా ఏర్పరచుకోవచ్చునని సోవియట్ ప్రవీణుల ప్రతిపాదించారు. నేడు తొలి మార్గం నిర్మాణం సాగుతూ వుంది. ఇది కలకత్తా ఉత్తరం నుండి, దక్షిణానికి, డండం అంతర్జాతీయ విమానాశ్రయాన్ని, నగరంలోని వాణిజ్య ప్రాంతంలో కలుపుతుంది. 16 43 కిలోమీటర్ల పొడవుగల యీ మార్గం 17 సెక్షన్లుగా విభజించ బడింది.

నేడు 12 సెక్షన్లలో నిర్మాణ కార్యక్రమం చురుకుగా సాగుతూ వుంది. ఈ మార్గంలో ఒక రైల్వేస్టేషన్ నిర్మాణం దాదాపు పూర్తి అయింది. ఇది కలకత్తా మైదాన్‌కు సమీపంలో వుంది. ఈ మొత్తం మార్గంలో యిది అతి పెద్ద స్టేషన్. ఈ భూగర్భ రైల్వేలోని ఇతర మార్గాలన్నింటిలాగే యిదికూడా ఎయిర్ కండిషన్డ్ చేయబడుతుంది. ఇది 500 మీటర్ల ప్లాట్ ఫారంతో సువిశాలంగా వుంటుంది.

ఈ మార్గంలో ప్రాయోగికంగా తొలి భూగర్భ రైలు 1981 చివరిలో గానీ, 1982 ప్రారంభంలో గానీ నడుస్తుంది. రైలు పెట్టెలు మద్రాసులోని పెరంబూర్ ఇంటెగ్రల్ కోచ్ ఫ్యాక్టరీలో నిర్మించబడుతూ వున్నాయి.

## అవగాహన

'ఆ— కన్పడుతూనే వుంది. మీరు మీ భార్యను ఎంత గౌరవించేది? ఇంత పెట్టి యిన్నిమాటలు మాట్లాడేరు? ఒక్కసారి 'ఏమండీ' అని నన్ను సంబోధించారా? "మీరు" అని మన్ననే చేశారా? మీరే తెలివిగల వాళ్ళమనుకోకండి'

'క్షమించండి. అలాంటి పొరపాటు జరిగితే ఉద్దేశ్యపూర్వకంగా జరిగిందికాదు. యికనుంచి అలాగే పిలుస్తానండీ. యిలాంటి కండిషన్లు యింకా ఏమున్నా వుంటే...'

'నాకు సంపూర్ణ స్వేచ్ఛ వుండాలి'

'అది జన్మహక్కు. కాదనను'

'నా హక్కులకు భంగం కలిగినా, మీవల్ల అమర్యాద జరిగినా, విడాకులిచ్చే హక్కు నాకుండాలి—'

యింకా యిలాంటి కండిషన్లు చాలా పెట్టింది మలయవాసిని. అన్నింటికి అంగీకరించాడు రాయ్. మలయవాసిని మొగుడయ్యాడు!

* * *

పెళ్ళి కాగానే మలయవాసిని తన యింటికి తీసుకెళ్ళానన్లేదు రాయ్. నాలుగురోజులు చూసి మలయవాసినే అడిగింది.

'నాకూ తీసుకెళ్ళాలనే వుందండీ. కానీ అలాగంటే సంప్రదాయ విరుద్ధమైన మీరేమంటారోనని...'

'నేననేదేమిటి?'

'మీ యింటికి నేనెందుకు రావాలి? అది పాతపద్ధతి. మీరే మా యింటికి రావచ్చు?— అని మీరడగ వచ్చుగా?'

అడగొచ్చు. అది పాయింటే? కానీ మలయవాసిని అడగలేదు.

అత్తగారింటికి వెళ్ళిన వారం తిరగకుండానే ఆమెతో సిద్ధాంత పరమైన విభేదాలొచ్చాయి.

అత్తగారిది బొత్తిగా ఛాందసం. ఆధ్యాత్మిక దృక్పథం. కొడుకు కోడల్ని 'ఏమండీ' అని పిలవటం కర్ణకఠోరంగా, అశాస్త్రీయంగా వినిపించిదామెకు.

'పేరులో, పిలుపులో ఏముందిలేమ్మా? నీ కోడలు సర్దాపడుతోంది. స్వల్పకోరిక. తీరిస్తే ఆమె సంతోషిస్తుందిగా? తగాదా ఎందుకు?'

కొడుకుతో కాదనుకొని కోడలికే చెప్పి చూసింది.

'మీరు బూర్జువా వ్యవస్థలో పుట్టి పెరిగారండీ. నేను సోషలిస్టు వ్యవస్థ సాధనకు అంకితమైన వ్యక్తిని. దృక్పథాల్లో తేడా తప్పదు మరి!'

యీ వొక్క విషయంలోనే కాదు. యిలాంటి చాలా విషయాల్లో అత్తాకోడళ్ళ మధ్య స్పర్థ తప్పలేదు.

'నువ్వన్నట్టు కోడలు పాపం వ్యక్తిగతంగా మంచిదేరా. అయితే ఆమె సిద్ధాంతాల్లోనే ఎక్కడో పెద్ద లోపం వున్నట్టు వుంది. లేకపోతే ఆమె అర్థం చేసుకోవటంలో లోపమో? ఏమైనా నేను మీ మధ్య స్పర్థలకు కారణం కాకూడదుగా? కొన్ని రోజులు దేశం చూసొస్తాను. ఏర్పాటు చెయ్యి'

[illegible] అంత కొంపలో ఒంటరిగా ఆత్మీయులతా భావనలు లేకుండా నాలుగ్రోజులు గడిచేసరికి మలయవాసినికి బోర్ కొట్టింది. ఏకాంతాన్ని భరించలేక పోయింది. ఒక పోర్షను అద్దెకిస్తే?

'ఎందుకండీ. యింట్లో యిల్లు అద్దెకిచ్చుకోవాల్సిన ఆర్థిక అవసరం మనకుందంటారా? లేదని నా అభిప్రాయం. ఆ తర్వాత మీ యిష్టం. మీ యిష్టాన్ని నేను కాదను'

పెళ్ళయిన తర్వాత మొదటిసారిగా భర్త తన మాట కాదంటే బాగుందనిపించింది మలయవాసినికి. అయినా యిదెక్కడి భర్త? అన్నీ తన యిష్టమంటాడేం? యిదెక్కడి మంచితనం?

ఆమెకు భర్త మీద చిరాకు వేసింది. చిత్రం! క్షణంలో ఆ చిరాకు సిద్ధాంత రూపం దాల్చింది!

'యిల్లు అద్దెకివ్వాల్సింది మనకు ఆర్థిక అవసరం వుంటేనే కాదండీ. అది బూర్జువా దృక్పథం. అవతలి వారి అవసరాన్ని కూడా ఆలోచించటం సామాజికస్పృహ—సోషలిస్టు దృక్పథం!'

అలా భర్త మీద విజయం సాధించింది. కానీ తీరా అద్దెకివ్వ వచ్చేసరికి గిరి గిరి బేరమాడింది. అవతలివాడు మధ్యతరగతి

(44వ పేజీ చూడండి)

# మువ్వల మురళి



## సీరియల్ — ఆర్. సంధ్యాదేవి

ఆ మాటలు తను విననట్టు నటించి, శ్రద్ధగా పుస్తకం చదవసాగింది.

"విన్నూ" అంటూ అతను లేచివచ్చి, తలుపులు మూసేసి, చేతిలో పుస్తకం లాగేసి టేబుల్‌పై గిరాటువేశాడు.

'ఏం పని ఇది' అన్నట్టు చిరుకోపంతో చూసింది హరిత.

భార్య నడుంచుట్టూ చెయ్యివేసి, పైకి లేవదీసాడు.

"అబ్బబ్బ!" అంటూ విసుక్కుంది, భర్త పట్టు విడిపించుకుంటూ! అతను ఆమెను వదలకుండా లైటు ఆర్పేసి మంచం దగ్గరకు తీసుకు వెళ్ళాడు.

కృష్ణసుమంత్ దిండు మీదకు తల వాల్చి పడుకున్నాడు. హరిత అతని గుండెలపై అనిర్వచనీయమైన ఆనందంతో మునిగిపోతూ తలవాల్చింది. అతని చేతులు ఆమెచుట్టూ పడి మరింత గట్టిగా బిగుసుకున్నాయి.

* * *

కృష్ణసుమంత్ కోర్టుకి వెళ్తుంటే అడిగింది— "సాయంత్రం త్వరగా వచ్చేస్తారా? మా యింటికి వెళ్దాం."

అతను భార్య మాటలకి క్షణం ఆలోచించి అన్నాడు — "నువ్వు ఇప్పుడు వెళ్ళు. సాయంత్రం వరకూ అక్కడ సరదాగా వుండు. నేను కోర్టు నుండి అలా వస్తాను. ఇద్దరం కలిసి వచ్చేద్దాం." 'ఏం సరేనా!' అన్నట్టు చూశాడు.

హరితకు భర్త మాటలు నచ్చాయి. 'అలాగే' అని చెప్పి తయారయి, భర్తతో కారులో బయలుదేరింది.

ఆమెను వాళ్ళ యింటిదగ్గర దించేసి అతను వెళ్ళిపోయాడు.

హరిత రావటం గోవిందమ్మకు, విశాలికి చాలా సంతోషం అయింది. మల్లిఖార్జునరావు అప్పుడే ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

"ఏమిటి అమ్మాయ్ విశేషాలు!" అడిగింది విశాలి.

"ఏవున్నాయి! నువ్వే చెప్పు" అంటూ నవ్వింది.

"సరే! నేను ఏం చెప్తాను! కొత్తగా పెళ్ళి అయి వెళ్ళినదానవు నువ్వు చెప్పు గాని" అంటూ విశాలి నవ్వింది.

"అందుకే నాకు ఒక్కదానికి రావడానికి భయం, నీకు జడిసే!"

"నేను ఏమన్నాను ఇప్పుడు!"

"అబ్బబ్బ! అస్తమానూ ఇద్దరికి అసలు నోరు ఉండబట్టదు" గోవిందమ్మ మృదువుగా విసుక్కుంది, తెచ్చిపెట్టుకున్న కోపంతో.

(గత సంచిక తరువాయి)

ఆ రోజు అంతా నవ్వులతో, హాస్యంతో సరదాగా గడిచిపోయింది.

మల్లిఖార్జునరావు సాయంత్రం ఆఫీసునుండి వచ్చాడు. చెల్లెలు రావటం అతనికి సంతోషంగా వుంది.

"బావగారు రాలేదా!" చెల్లెల్ని ప్రశ్నించాడు.

"ఇప్పుడు వస్తారు."

"చూశారా! మీ చెల్లెలు అప్పుడే పుట్టింటిని మర్చిపోయింది. ఈ రాత్రికి వుండిపొమ్మంటే వుండదట" అంది విశాలి కల్పించుకుంటూ.

'అదేం!' అన్నట్టు చెల్లెలువైపు ఆశ్చర్యంగా చూస్తూ అన్నాడు.

"ఈ రాత్రికి ఇక్కడే వుండిపోకూడదా?"

"లేదు మరోసారి వస్తానులే" అంటూ నసిగేసింది.

"అన్నయ్యగార్నికూడా ఇక్కడే వుంచేస్తాం" అంటూ విశాలి పైట చెంగు అడ్డుపెట్టుకుని నవ్వింది.

"ఆయనకు అసలు తీరిక వుండదు. ఇంటికి వెళ్ళేసరికి హాలులో ఆయన కోసం క్లయింట్స్ కాసుకు కూర్చుంటారు. వాళ్ళు వెళ్ళేటప్పటికి చాలా టైము అవుతుంది."

"ముందు మీ చెల్లెలే చెప్పేస్తుంది" అంది విశాలి.

మల్లిఖార్జునరావు తనలో తాను చిన్నగా నవ్వుకున్నాడు. ఆడపిల్లలు పెళ్ళి అయి వెళ్ళిపోతే ఎంతలోకి మారిపోతారు. నిన్న మొన్నటివరకూ 'అన్నయ్యా' అంటూ వెంట తిరుగుతూ, అల్లరి చేసిన హరిత ఈ రోజు ఇంటి బాధ్యతలు అన్నీ పైనవేసుకుని క్షణం తీరికలేని ఇల్లాలిగా — 'ఆ యింట్లో తను లేకపోతే క్షణం గడవదు' అన్నట్టు మాట్లాడుతుంటే అతనికి ఆశ్చర్యంగా, ఆనందంగా అనిపించింది. చెల్లెలు ఎప్పుడూ ఇలాగే సంతోష, సౌఖ్యాల సౌభాగ్యంతో నూరేళ్ళు నిండుగా వుండాలని ఆ అన్న మనసు దీవించింది.

### 23

కోర్టునుండి అతను ఇంటికి వచ్చేసే టైము అయిందిగాని అతను రాలేదు. హరిత భర్తరాక కోసం ఎదురుచూపులు చూడసాగింది. టైము ఆరు గంటలు దాటిపోయింది. కృష్ణసుమంత్ రాలేదు.

"కోర్టునుండి తిన్నగా ఇక్కడికే వస్తాను అన్నారా!" అని వరసగా ఒక్కొక్కళ్ళూ ఆమెను ప్రశ్నించసాగారు.

'అతను యింటికి వెళ్ళి ఇలా వస్తాను అంటే పొరపాటుగా విన్నది ఏమో' అని వాళ్ళ అనుమానం.

"లేదు లేదు. కోర్టునుండి తిన్నగా ఇటే వస్తానని చెప్పారు" నమ్మకంగా అంది.

అతను ఏడు గంటలు అయినా రాలేదు. యింటికి ఫోన్‌చేసి కనుక్కుంటే, "బాబుగారు అసలు కోర్టునుండి ఇంటికే రాలేదని" నౌకరు చెప్పాడు.

హరితకు ఒక్కసారి మతిపోయినట్టయింది. "కోర్టునుండి అసలు ఇంటికే రాలేదు అంటే ఈ మనిషి ఎక్కడికి వెళ్ళినట్టు! ఏమైనట్టు!"

ఇంటికి వెళ్ళిపోతాను అంటే మరోగంట చూడమన్నారు తల్లీ, అన్నగారు.

"ఏ కేసు గురించి ఎక్కడికి వెళ్ళారో! ఏ స్టేట్‌మెంట్ తీసుకోవడానికి వెళ్ళారో! నువ్వు కంగారుపడితే ఎలా చెప్పు! లాయర్ అంటే వాళ్ళకి ఎన్నో పనులు ఉంటాయి మరి. క్షణం తీరిక ఉండదు" అన్నాడు మల్లిఖార్జునరావు,

**జరిగిన కథ — 7 :** ఏ. యు. సి. పాసయిన మల్లిఖార్జునరావు చెల్లెలు హరితకు, తెచ్చిన ఏ సంబంధమూ నచ్చటంలేదు. తన పెద్ద మామయ్య శంకరంగారి కూతురు లీల పెళ్ళికి మద్రాస్ వెళ్తుండగా ఆమెకు ట్రైన్‌లో 'కృష్ణసుమంత్'తో పరిచయ మేర్పడుతుంది. అతని అందాన్ని మనసులో మెచ్చుకొంటుంది. మళ్ళీ అతను లీల పెళ్ళిలో కనబడ్డప్పుడు ఆమె కలవరపడుతుంది. మామయ్య కొడుకయిన కుమార్ భార్య శైలజ కోరగా ఆమెతో బలభద్రరావుగారింటికి వెళ్తుంది హరిత. విజయమ్మా, బలభద్రరావుగార్ల ఏకైక పుత్రుడే ఈ కృష్ణసుమంత్ అని తెలుసుకుంటుంది హరిత. విశాఖపట్నంలో లాయర్‌గా పనిచేస్తున్న కృష్ణసుమంత్‌కి రామనాధం మేష్టారు ద్వారా పరిచయమైన తండ్రిలేని రోజాను, ఆమె తల్లి సీతమ్మను సంరక్షిస్తుంటాడు. తన ఫ్రెండ్ తమ్ముడికి ఉద్యోగం వేయించమని అడగటానికి వస్తాడు మల్లిఖార్జునరావు. అతనికే విషయమూ మరునాడు చెబుతానని చెప్పి, వచ్చేటప్పుడు హరితను కూడా తీసుకురమ్మని వాళ్ళని డిన్నర్‌కి ఆహ్వానిస్తాడు కృష్ణసుమంత్. మల్లిఖార్జునరావు చాకచక్యంగా హరితను డిన్నర్‌కు తీసుకువెళ్తాడు. కృష్ణసుమంత్ ఫ్రెండ్ శాస్త్రి ద్వారా అతని తల్లిదండ్రుల అడ్రస్ కనుకొని, వెళ్ళి హరిత పెండ్లి విషయం మాట్లాడివస్తాడు మల్లిఖార్జునరావు. కృష్ణసుమంత్ తల్లిదండ్రులు వచ్చి, హరితతో అతని పెళ్ళి నిశ్చయం చేసి వెళ్తారు. కృష్ణసుమంత్, హరితల వివాహం అతివైభవంగా జరిగిపోతుంది.

చెల్లెలు కంగారుపడుతుంటే మృదువుగా మందలిస్తూ.

హరిత ఏం మాట్లాడలేదు. పదిమిది గంటల వరకూ చూసి అతను ఇంకా రాకపోతే అన్నగారితో యింటికి బయలుదేరింది.

మల్లిఖార్జునరావు కారులో తీసుకెళ్ళి ఆమెను వాళ్ళ యింటిదగ్గర దించేసి అతను వచ్చేవరకూ వుంటానంటే, వద్దని చెప్పి అన్నగార్ని యింటికి పంపేసింది ఆయన రాగానే ఫోన్ చేస్తాను అంటూ చెప్పి. అతను వెళ్ళిపోయాడు.

హరిత హాలులో మతిపోయినదానిలా అలా కూర్చుంది. పదకొండు గంటలు అవుతుండగా, పోర్టికోలో కారు ఆగిన శబ్దం అయింది. యోచనా జలధిలో మునిగిపోయిన ఆమె ఒక్కసారి ఉలిక్కిపడి నెమ్మదిగా అయింది, ఆ కారుశబ్దం చెవులపడగానే!

కాలింగ్‌బెల్ మ్రోగింది. హరిత వెంటనే వెళ్ళి తలుపు తీసింది గుమ్మంలో అతను నిలబడి వున్నాడు. భార్యని చూస్తూనే చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వులో కళా కాంతి లేదు. తెచ్చిపెట్టు కున్నట్టుగా వుంది. అతని వాలకం చూస్తుంటే మనిషి ఎక్కడెక్కడో తిరిగివచ్చినట్టుగా క్రాప్ రేగిపోయి ఎలాగో ఉన్నాడు.

అప్పుడేం ప్రశ్నించలేదు ఆమె. అతనూ తను ఆలశ్యంగా రావడానికి కారణం చెప్పలేదు.

# మువ్వల మురళి

తిన్నగా మేడమీద తన గదిలోకి వెళ్ళి, బట్టలు మార్చుకుని టవల్ తీసుకుని స్నానం చేసివచ్చాడు. అతను చాలా అలిసిపోయినట్టుగా వంటిమీద చొక్కా అయినా వేసుకోకుండా పట్టీ షరాయ్‌తో మంచంమీద పడుకుండిపోయాడు.

భోజనానికి రమ్మనిపిలిచింది భర్తని హరిత.

'ఈవేళ నాకు ఆకలిలేదు, భోజనం వద్దని' చెప్పేశాడు.

ఆమె ఇంకేం మాట్లాడకుండా మౌనంగా లక్కడినుండి వెళ్ళిపోయి పది నిమిషాల తరువాత పాలగ్లాసుతో ఆ గదిలోకి ప్రవేశించింది.

"పోనీ ఈ పాలు అయినా త్రాగి పడుకోండి" అంటూ ఆ గ్లాసు భర్తకు అందిచ్చింది.

కృష్ణసుమంత్ కాదనకుండా ఆ గ్లాసు అందుకుని మౌనంగా ఆ పాలు త్రాగి, ఖాళీగ్లాసు భార్య చేతికి ఇస్తూ ఆమె కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు –

"నువ్వు భోజనం చేశావా ?"

"లేదు, చేస్తాను" ముక్తసరిగా చెప్పింది.

"నాకోసం ఎదురుచూస్తూ కూర్చున్నావా !" అనురాగంతో ప్రశ్నించాడు.

భర్త మాటలకి సమాధానం చెప్పకుండా ఆ గ్లాసు తీసుకుని అక్కడనుండి వెళ్ళిపోయింది.

పది నిమిషాల అనంతరం ఆమె ఆ గదిలోకి వచ్చి, తలుపులు మూసి, లైట్ ఆర్పి మంచంమీద పడుకుంది.

కృష్ణసుమంత్ రోజూలా చిలిపిచూపులతో కవ్వించి, కొంటెమాటలతో వేధించలేదు. సుదీర్ఘమైన ఆలోచనల్లో మునిగిపోయినట్టు అతని గంభీరవదనమే ఆమెకు తెలియచెపుతూంది. పెళ్ళి అయి నెల కావస్తూంది, ఏరోజూ ఆయన ఇలా ఉండటం తనకి తెలీదు. బరువుగా నిట్టూర్చింది.

భర్తకి దగ్గరగా జరిగి అతని గుండెలమీద చెయ్యి వేసింది మౌనంగా. అతని మౌనం ఆమె భరించలేకపోతూంది. కృష్ణసుమంత్ కళ్ళు విప్పి భార్యవైపు చూసి చిరునవ్వు నవ్వి, అవ్యాజమైన ప్రేమానురాగాలతో ఆమె చెంపలు నిమిరి, నడుం చుట్టూ చెయ్యివేసి దగ్గరకు లాక్కున్నాడు.

మర్నాడు ఉదయం అతను రోజూలా మామూలుగా సరదాగానే వున్నాడు. భర్త మామూలుగా, సరదాగా వుండటం ఆమె మనసుకి హాయిగా అనిపించసాగింది.

కృష్ణసుమంత్ స్నానం చేసి, బట్టలు మార్చుకుని అద్దం దగ్గర నిలబడి తల దువ్వుకుంటూ భార్యవైపు చూశాడు 'తలకి క్రీమ్ వ్రాయవా!' అన్నట్టు.

"మీకు రోజూ చెపుతూనే వుంటాను, స్నానికి వెళ్ళేముందు తలకి క్రీమ్ వ్రాసుకోమని" అంటూ టేబుల్‌మీద క్రీమ్ ట్యూబ్ అందుకుంది.

"చెప్తావుగాని మర్చిపోతుంటాను, గుర్తు వుండదు" అంటూ నవ్వాడు.

"ఇలాటి విషయాలు గుర్తు వుండవు, కేసులు గురించి అయితే అన్ని విషయాలు గుర్తు వుంటాయి."

"నాకు ఇప్పుడు అర్థం అయింది, మగవాడు పెళ్ళి చేసుకోవాలి అంటే ఎందుకు సందేహించి భయపడతాడో."

విస్మయంగా చూసింది అతనివైపు 'ఎందుకని' అన్నట్టు.

"పురుషుడు స్త్రీ మెడలో మంగళసూత్రం ముడివేసిన మరుక్షణం తన స్వతంత్రాన్ని కోల్పోయి, తన అధిక్యతను, అభిమానాన్ని అన్నీ ఆమెకు అప్పచెప్పి, భార్యకు దాసుడై ఆవిడ చెప్పుచేతల్లో నడుచుకుంటూ జీవితం అంతా ఖైదీగా వుండాలని." అంటున్న అతని కళ్ళు కొంటెగా మెరిశాయి.

భర్త చమత్కారపు మాటలకి హరిత ఫక్కున నవ్వింది.

"పాపం! మీరా అలా వుండేది" అంటూ ట్యూబ్‌లో క్రీమ్‌ని అరిచేతిలో వేసుకుని రెండు చేతులకీ రాసుకుని "అలా కూర్చోండి" అంది.

"ఫర్వాలేదు రాసెయ్యి!" అంటూ అతను తలవంచాడు.

ఆమె పొడుగ్గా వున్నప్పటికీ, అతను బాగా పొడవు ఏమో ఆమె అతని బుజాలవరకే వస్తుంది. అతను నిలబడి వుంటే తలకి క్రీమ్ రాయాలంటే కొద్దిగా కష్టమే' మనిషంత మనిషి బాగా





## అతడికి 3 నెలలు నిండాక, పాలు మాత్రమే ఇస్తే సరిపోదు

# మీ పాపాయికి కావలసినది ఫారెక్స్

## పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

**3 నెలల వయస్సు—ఘన ఆహారం ప్రారంభించవలసిన సమయం.**

3 నెలలు నిండాక, పాపాయి పెరిగే అవసరాలకు కేవలం పాలు మాత్రమే సరిపోవు. పాపాయి చురుకుగా, తొందరగా పెరుగుతూంటాడు. అంచేత కేవలం పాలు ఇవ్వగలిగే వాటికన్నా ఎక్కువ కాలరీలు అతడికి కావాలి. అంతేకాదు, పాలు తాగడాన్ని తగ్గింది హెచ్చు కాలరీలు ఇచ్చే ఘన ఆహారం అతడికి అవసరం. ఈ సమయంలోనే మీ పాపాయికి నమలడం అలవాటు కావాలి. అప్పుడే, తర్వాత "పెద్దలు తినే" ఆహారాలను చక్కగా నమిలి మింగగలుగుతాడు. పైగా, పాపాయికి ఇప్పుడు రుచి అనుభవం కూడా పెరుగుతూంటుంది. అంచేత, అతడికి కొత్త రుచుల్ని పరిచయం చెయ్యవలసిన సమయం ఇది.

**3 నెలల వయస్సు—మరింతగా ఐరన్ కావలసిన సమయం.**

"పాపాయికి ఘన ఆహారాలు ప్రారంభించేందుకు 2-4 నెలల మధ్య వయస్సు ఉత్తమమైనది. పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందువల్ల అది సంపూర్ణ ఆహారంకాదు. అందుకే పాపాయికి ఐరన్ గల ఘన ఆహారాలు కావాలి."

డాక్టర్ సుభాష్ సి. ఆర్య:
"ఇన్‌ఫేంట్ అండ్ చైల్డ్ కేర్ ఫర్ ది ఇండియన్ మదర్."

**డాక్టర్లు ఫారెక్స్ ఎందుకు సిఫార్సు చేస్తారు?**

ఘన ఆహారాలు ప్రారంభించడం కోసం, ప్రత్యేకంగా తయారు చేయబడిన ఆహారం ఫారెక్స్. మీ పాపాయి సున్నితమైన జీర్ణశక్తికి అనువుగా వుండేటట్లు ముందే పచనం చేయబడింది. ఫారెక్స్‌లో ఉన్నాయి—సత్వర పెరుగుదలకు ప్రొటీన్లు; శక్తి కోసం కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు; దృఢమైన ఎముకలు, గట్టి పళ్ల కోసం కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్లు; ఆరోగ్యవంతమైన రక్తం కోసం ఐరన్. వీటన్నిటి వల్లా ఫారెక్స్, పాపాయి సంపూర్ణమైన పెరుగుదలకు ఆదర్శవంతమైన ఘన ఆహారం.

**ఉచితం!** "పాపాయి మొదటి ఏడాది పుస్తకం" కొత్తగా తల్లులైన వారు పిల్లల పట్ల తీసుకోవలసిన శ్రద్ధ గురించి సులభ రీతిలో వివరిస్తుంది. మీ ప్రతి కోసం, 50 పైసల స్టాంపు జతపరుస్తూ ఈ క్రింది చిరునామాకు వ్రాయండి:

**పి. ఓ. బాక్స్ నం. 19119, (FAR 15 T),**
**బొంబాయి 400 025.**






## డాక్టర్లు సిఫార్సు చేస్తారు ఫారెక్స్

## సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

CASGLF-10-244 Tel

వంగాలి అంటే అతనికీ కష్టమే మరి ! అందుకే హరిత అతన్ని డ్రస్సింగ్ టేబుల్‌దగ్గర స్టూల్ మీద కూర్చోమంటుంది. కృష్ణసుమంత్‌కి ఇక తప్పనట్టూ అక్కడ స్టూల్‌మీద కూర్చున్నాడు.

అతని తలకి క్రీమ్ రాస్తుంటే, ఆమె నడుం చుట్టూ చేతులు వేసి ఆమె గుండెలకి తల ఆన్చాడు.

"తలకి క్రీమ్ రాస్తుంటే ఏమిటీ షోకు" అంటూ భర్త తలని వెనక్కి తోసింది, చిరుకోపంతో !

"ఆ చేత్తో తలకూడా దువ్వేస్తారా ?" అడిగాడు నవ్వుతూ.

హరిత మాట్లాడలేదు. దువ్వెన అతని చేతికి ఇచ్చి, అతని పట్టు విడిపించుకుని అక్కడనుండి వెళ్ళిపోయింది.

## 24

కృష్ణసుమంత్ కోర్టుకి వెళ్తుంటే మల్లిఖార్జునరావు వచ్చాడు.

"హలో గుడ్‌మార్నింగ్ ! ఏమిటి ఇలా వచ్చారు !" అంటూ నవ్వుతూ ప్రశ్నించాడు.

హరిత నవ్వుతూ అక్కడే నిలబడింది.

# మువ్వల మురళి

"మీరు నిన్న మా యింటికి వస్తానని రాలేదేం ! రాత్రి పదకొండు గంటలకి వచ్చారని మా చెల్లి యింటికి ఫోన్ చేసింది." అన్నాడు.

కృష్ణసుమంత్ నవ్వాడు. "ఒక కేసు గురించి ఇన్‌స్పెక్టర్‌తో మాట్లాడదామని పోలీస్ స్టేషన్‌కి వెళ్ళాను. అక్కడ ఆలశ్యం అయింది."

"ఆహాఁ ! అలాగా ! పోని మీరు అక్కడనుండి ఫోన్ అయినా చేశారుకాదు. మా చెల్లెలు ఒకటే కంగారుపడిపోయింది, మీరు ఇంకా యింటికి రాలేదని" అంటూ నవ్వాడు.

కృష్ణసుమంత్ నవ్వుతూ భార్యవైపు ఓరగా చూశాడు. హరిత అన్నగారు అలా చెప్పటంతో కాస్త సిగ్గుపడినట్టు అయింది. మల్లిఖార్జునరావు కాసేపు కూర్చుని 'ఆఫీసుకి టైము అయిపోయింది' అంటూ వెళ్ళిపోయాడు.

కృష్ణసుమంత్ కోర్టుకి వెళ్తూ భార్యకి చెప్పాడు, 'సాయంత్రం రిసెప్షన్ వుంది వెళ్ళాలి' అంటూ. 'నేను వచ్చేటప్పటికి సిద్ధంగా ఉండమని' చెప్పాడు.

హరిత 'అలాగే' నంటూ తల వూపింది.

సాయంత్రం కృష్ణసుమంత్ వచ్చేటప్పటికి ముస్తాబు అయి కూర్చుంది.

అతనుకూడా స్నానంచేసి డ్రస్సు మార్చుకున్నాడు. భర్తవైపు క్షణం అలాగే రెప్పవాల్చకుండా చూసింది. గంభీరంగా, ఎత్తుగా, దృఢంగా వున్న అతను ఎంతో ఠీవిగా, హుందాగా వున్నాడు. కళ్ళకి నల్లటి షేప్ కళ్ళద్దాలు. నేవీబ్లూ ఫుల్‌సూట్, మెడలో మస్టేట్ కలర్‌పై వైట్ డాట్స్ వున్న టైతో ఎంతో అందంగా, సుందరంగా వున్నాడు.

భర్త సుందర మంగళ విగ్రహాన్ని చూస్తూనే ఆమె కళ్ళు గర్వంతో తళుక్కున మెరిశాయి.

హరిత తనవైపే రెప్పవాల్చకుండా చూడటం గమనించి చిరునవ్వుతో ఆమెను పరీక్షగా చూశాడు కృష్ణసుమంత్. మెరూన్ కలర్ పట్టుచీరకు వైట్ బోర్డర్ చీరంతా జరీబుటా దగ్గర దగ్గరకు వుంది. మెరూన్ కలర్ జాకెట్ వేసుకుంది. చీరంతా జరీబుటా వుండటంవలన లైటు వెలుగులో తళతళా మెరిసిపోతూంది. నుదుట మెరూన్ కలర్ సింగార్ తిలకం గుండ్రంగా పెద్ద బొట్టు పెట్టుకుంది. కళ్ళకు కాటుక తీర్చిదిద్దింది. పెదవులకి లిప్‌స్టిక్ వేసుకుంది. కనుబొమ్మలు సన్నగా, గీత గీసినట్టు దిద్దినట్టు అందంగా వున్నాయి. ముత్యాల గాజులతోపాటు చేతికి మెరూన్ కలర్ వైట్ గాజులు వేసుకుని, ఎడంచేతికి వాచీ పెట్టుకుంది. మెడకు ముత్యాల నెక్లేసు, చెవులకి ముత్యాల జూకాలు పెట్టుకుంది. పైటపై పొడుగ్గా వున్న ఒంటిపేట బంగారు గొలుసు వేసుకుంది. జుత్తుని శిగ చుట్టుకుని, చెంపకు ఒక పక్కగా పెద్ద రేకులు విడిచివున్న తెల్లగులాబి పెట్టుకుంది. సన్నగా, పొడుగ్గా, రివటలా, నాజూగ్గా, అందంగా, చక్కగా బొమ్మలా మెరిసిపోతున్న భార్యవైపు చూసి కొద్దిగా గర్వపడ్డాడుకూడా !

ఆ అందాల సుందరి తనకు అర్ధాంగి అయినందుకు మురిసిపోయాడు.

అతని కళ్ళల్లోకి అలాగే చూసిన హరిత మనసు మయూరంలా నాట్యం చెయ్యసాగింది.

ఆమె ముఖంలోకి అలాగే చూసిన కృష్ణసుమంత్ పెదవులపై ప్రత్యక్షమైన చిరుదరహాసం ముఖం అంతా అల్లుకుని అతని ముఖం కోటి పున్నెమల కాంతితో శోభిల్లసాగింది.

ఇద్దరూ కారులో రిసెప్షన్‌కి బయలుదేరి వెళ్ళారు. కృష్ణసుమంత్ ఫ్రెండ్ పెళ్ళి కరీమ్‌నగర్‌లో అయింది. పెళ్ళికూతుర్ని ఈ వూరు తీసుకువచ్చాక వాళ్ళ యింటి దగ్గర రిసెప్షన్ ఏర్పాటుచేసి, ఫ్రెండ్స్ అందర్నీ పిలిచాడు. కృష్ణసుమంత్ భార్యతోసహా వెళ్ళటంతో అంతా ఎంతో మర్యాద చేశారు, భార్యాభర్తలు ఇద్దర్నీ !

లాయర్ కృష్ణసుమంత్‌గారు అని కొందరు, లాయర్‌గారు అని కొందరు, బాబూ అని కొందరు, కృష్ణా అని కొందరు ఇలా రకరకాలుగా పిలుస్తూ అతన్ని పలకరించసాగారు. ప్రతి ఒక్కరితో చిరునవ్వుతో ఆదరంగా మాట్లాడసాగాడు.

ఇక హరితసంగతి — ఆమె చుట్టూ కొంతమంది ఆడవాళ్ళు మూగిపోయారు. హరిత అందాన్ని, అదృష్టాన్ని పొగుడుతూ రకరకాల ప్రశ్నల వర్షం

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగ్రొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక
పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు,
గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్,
హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.

ఆమెపై కురిపించేశారు. కొందరు అదే పనిగా మాట్లాడుతుంటే, మరి కొందరు రెప్పవాల్చటం కూడామరిచి కళ్ళుఅప్పగించి, నోరు వదిలేసి హరిత వైపు చూడసాగారు. అలా చూసిన వారిలో చదువుకున్నవాళ్ళు, ఫ్యాషన్‌గా వున్న వాళ్ళూ వున్నారు. వంటినిండా వస్తువులు వేసుకున్న వాళ్ళూవున్నారు. అదేమిటో అందంగా, ఫ్యాషన్‌గా ఉన్న వాళ్ళని ఒళ్ళు మరిచిపోయి చూస్తారు. అందుకే సాధారణంగా హరిత ఎవరింటికీ వెళ్ళదు. పెళ్ళిళ్ళకుగాని, ఫంక్షన్‌లకి, పార్టీలకిగాని వెళ్ళదు ఇలాటి చూపులకి భయపడే! అలాటి చూపులని ఎదుర్కొనే వాళ్ళు ఎంత ఇబ్బందికి గురి అవుతారో ఎవ్వరూ గ్రహించలేరు. కాలు కదిపినా, చెయ్యి తిప్పినా, కళ్ళు తిప్పినా అంతా ఆమెను డాన్స్ బొమ్మలా చూస్తుంటే ఆమెకు ఎంత ఇబ్బందో ఎవ్వరికీ తెలీదు. హరిత వాళ్ళ మధ్య బొమ్మలా బిగుసుకుపోయి కూర్చుంది. అయితేనేం అంతా ఆమెను లాయర్‌గారి భార్య అని ఎంతో గౌరవంగా చూడసాగారు.

పార్టీ మొదలు అయ్యింది. రిసెప్షన్‌లో ఆర్కెస్ట్రా మొదలు అయింది. వాళ్ళు ఎంతో చక్కగా పాడటంతో ఆ పాటలు వింటూ అలాగే కూర్చుంది హరిత. కృష్ణసుమంత్‌కూడా పాటలు వింటూ కూర్చున్నాడు.

శాస్త్రి అక్కడికి హడావుడిగా వచ్చి అతనికి మెల్లగా ఏదో చెప్పాడు. అతను చెపుతుంటే కృష్ణసుమంత్ కనుబొమ్మలు ముడిపడ్డాయి. మొదట ఆ మాట ఏమిటో తనకి అర్థం కానట్టు, తరువాత అతని కనుబొమ్మలు యధాప్రకారం మామూలుగా అయిపోయి మనసులో కంగారుని పైకి కనిపించనివ్వకుండా చటుక్కున లేచి నిలబడి, శాస్త్రితో 'నువ్వు వెళ్ళు. నేను ఇప్పుడే వస్తా'నని చెప్పి ఫ్రెండ్ దగ్గరకు వెళ్ళి ఏదో చెప్పేసి, హరితని రమ్మన్నట్టుగా దూరాన్నుంచే సైగ చేశాడు. ఆ చూపులని అర్థం చేసుకున్న హరిత వెంటనే లేచి వచ్చేసింది.

''పద యింటికి వెళ్ళిపోదాం'' అన్నాడు. ఆ మాటలు తాపీగా చెప్పినా, ఆ మాటల్లో కంగారు స్పష్టంగా తెలుస్తూనే వుంది. అర్థం కానట్టు అయోమయంగా చూసింది భర్తవైపు. అతను ఆమెవైపు చూడలేదు, కంగారుగా త్వరత్వరగా ముందుకు నడవసాగాడు. మౌనంగా భర్తను అనుసరించింది. కారు స్టార్ట్‌చేసి స్పీడ్‌గా పోనిచ్చాడు.

భర్త ముఖంలోకి పరిశీలనగా చూసింది. అతని ముఖం చాలా గంభీరంగా వుంది. కారణం ఏమైవుంటుందో ఆమెకు అర్థం కావటంలేదు. అతను అలా వున్నప్పుడు అడిగి తెలుసుకోవటం అంత మంచిదికాదు. ఆ చికాకులో ఏమైనా అనవచ్చు. అలా మాటపడటం ఆమెకు ఇష్టంలేదు.

కారు యింటి దగ్గర ఆపేశాడు, కారు దిగమన్నట్టు భార్యవైపు చూస్తూ! హరిత ఆశ్చర్యంగా చూసింది. కారు గేటు ఇవతల రోడ్డు మీద ఆపేశాడు.

ఎప్పుడూ కారు పోర్టికోలో ఆగుతుంది. 'ఏదైనా ముఖ్యమైన పనిమీద వెళ్తాడేమో' అని మౌనంగా కారు దిగింది.

కృష్ణసుమంత్ కారుడోర్ మూస్తూ భార్యకు చెప్పాడు — ''నా కోసం చూడకు. భోజనం చేసి పడుకో'' అంటూ కారుని పోనిచ్చాడు.

కారు వెళ్ళిన వైపే చూస్తూ నిశ్చేష్టురాలై అలాగే నిలబడిపోయింది. హృదయం బరువెక్కిపోయినట్టు అయి దుఃఖం పొంగింది. హరిత కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగి అంతా మసకమసగ్గా కనిపించసాగింది.

పెళ్ళి అయి ఇన్నిరోజుల్లో ఏనాడు ఇలా బాధ పడలేదు. జీవితం హాయిగా, సాఫీగా గడిచి పోతూంది. అంతా తన అదృష్టం అనుకుంది. భర్త ఒక్కోసారి తనతో ముభావంగా వుండటం ఆమె సహించలేకపోయింది.

### రవి - కవి

కిరణాలతో గగనాన్ని దున్ని
ఉదయాన్ని పండిస్తాడు రవి
కలంతో కాగితాన్ని దున్ని
కవితల్ని పండిస్తాడు కవి
కిరణపు వేడితో ప్రకృతి
కుళ్ళు కడిగేస్తాడు రవి
కవనపు వాడితో సంఘం
కళ్ళు తెరిపిస్తాడు కవి
తన ఉష్ణాన్ని ధారపోసి చంద్రుడ్ని
తేజోవంతుడ్ని చేస్తాడు రవి
తన కష్టాన్ని ధారపోసి ప్రజల
ఇష్టాల్ని వెల్లడిస్తాడు కవి

— ఆదిభట్ల రామప్రసాద్

ఏ కేసు గురించి అయినా అతను ఆలోచిస్తుంటే తనతో చెప్పవచ్చుగా!

మరి ఏ సంగతి అయినా సరే తను అర్థం చేసుకుంటుందేగాని, అపార్థం చేసుకోదుకదా!

అతని ఇల్లాలుగా తను ఆ మాత్రం గ్రహించుకోలేదా!

తాళికట్టిన రోజునే భర్త కష్టసుఖాల్లో పాలు పంచుకుంటానని పదిమంది పెద్దల ఎదురుగా ప్రమాణం చేసిందే! మరి ఆ అవకాశం తనకు ఎందుకు ఇవ్వటంలేదు!

ఆ సంగతి అంత రహస్యమా!

అంత రహస్యంగా తననుంచి దాయవలసింది ఏవుంటాయి!

ఏ కేసు గురించి అయినా ఆలోచిస్తూ ఆ చికాకులో వున్నారేమో!

అనవసరంగా తను ఆయన్ని అపార్థం చేసుకుంటూందేమో!

తను అంటే ఆయనకు నిజంగా ఎంత అనురాగమో తనకి తెలియనిదికాదు. తనని రెప్పవాల్చకుండా చూపినప్పుడు ఆయన కళ్ళల్లో వెలిగే కాంతి కిరణాలు తను మరవగలదా!

భర్త మనసు భార్యకంటే ఇంకెవరికి తెలుస్తుంది!

కట్టుకున్న భార్యే అర్థం చేసుకోకపోతే మరి ఎవరు అర్థం చేసుకుంటారు!

హరిత మనసులో ఆలోచనలు కళ్ళెంలేని గుర్రాల్లా పరుగెడుతున్నాయి. తనకి తాను నచ్చ చెప్పుకుంటూ మెల్లగా లోపలకు వెళ్ళింది.

### 25

హరిత డ్రస్ మార్చేసుకుని, వస్తువులు తీసేసి, తలుపులు వేసేయమని నౌకర్లకు చెప్పి, చల్లటి మంచినీళ్ళు త్రాగి తన గదిలోకి వెళ్తూ, ''బాబుగారు వస్తే తలుపులు తియ్యండి'' అని చెప్పేసి వెళ్ళిపోయింది.

కృష్ణసుమంత్ యింటికి వచ్చేటప్పటికి పన్నెండు గంటలు అయింది. అతను తిన్నగా గదిలోకి వచ్చేశాడు. గది అంతా చీకటిగా వుంది. గోడకు వున్న స్విచ్ ఆన్ చేశాడు. అంతకుముందు ఆ గదిలో రాజ్యం చేస్తున్న చీకటి పటాపంచలు అయిపోయి, గది అంతా వెల్తురుతో నిండిపోయింది.

హరిత మేలకునేవున్నా కళ్ళు విప్పి చూడ లేదు. దగ్గరకు వచ్చి లేపి, ప్రేమగా పలకరిస్తాడు అని ఆశించి అతని అడుగుల సవ్వడికోసం చెవులు రెండూ రిక్కించి వినసాగింది.

కృష్ణసుమంత్ భార్యవైపు ఒకసారి చూసి నిద్రపోతూందని లైటు ఆర్పి మంచంమీద పడుకున్నాడు.

పక్కనే పడుకున్నాడని తెలుసు. హరితా! అంటూ దగ్గరకు లాక్కుంటాడు అని ఆశించింది. ఎంతసేపు అలా ఆలోచించినా అతను ఆమెను దగ్గరకు లాక్కునే ప్రయత్నం చెయ్యకపోయేసరికి హరితకు నిజంగా దుఃఖం ముంచుకువచ్చేసింది. ఉక్రోషంలో అటు తిరిగి పడుకుంది

మర్నాడు అతను మామూలుగా, సరదాగానే వున్నాడు. ఆరోజు హరితకు నిజంగానే ఒళ్ళు మండింది. అతనితో ముభావంగానే వుంది.

కృష్ణసుమంత్ భార్యని తరచి తరచి కారణం అడిగాడు. హరిత మొదట ఏం జవాబు ఇవ్వక పోయినా కొద్ది నిముషాల తరువాత ఉక్రోషంగా అడిగింది—

''ఈ యింట్లో నేను ఒకర్తెను వున్నానన్న సంగతి మీకు గుర్తు వుందా?''

సూటిగా అడిగిన ఆ ప్రశ్నకు అర్థంకానట్టు క్షణంసేపు అయోమయంగా చూశాడు భార్యవైపు.

''మిమ్మల్నే! ఏమిటి అలా చూస్తున్నారు!'' అడిగింది కోపంగా.

ఈవిడగారు తనతో ఏదో విషయం గురించి దెబ్బలాడడానికి సిద్ధంగా వుంది అని గ్రహించడానికి అతనికి ఎంతోసేపు పట్టలేదు. వస్తున్న నవ్వుని పెదవులవెనక దాచేసి గంభీరంగా ముఖం పెట్టాడు

''అసలు మీకు పెళ్ళి అయింది అన్న సంగతి గుర్తు వుందా! మీ భార్య మీ యింట్లో మసులుతూంది అని, ఆమెకో మనసూ, ఆమెకో ఇష్టం వుంటుంది అని ఏమైనా ఆలోచించగలుగు

తున్నారా!" రోషంగా అడిగింది.

"అసలు ఇప్పుడు ఏమైంది!" తాపీగా ప్రశ్నించాడు.

"ఏమీ కాలేదూ!" అంటూ దీర్ఘంతీస్తూ మళ్ళీ అంది — "నిన్న ఇద్దరం కలిసి సరదాగా రిసెప్షన్‌కి వెళ్ళాం. నాకు ఎంతో సంతోషం అయింది. ఆ సంతోషం ఏమైనా నా మనసులో కొద్దిసేపు అయినా వుండనిచ్చారా! నాతో మాట అయినా చెప్పకుండా లాక్కువచ్చి నన్ను నడిరోడ్డు మీద వదిలేసి పారిపోతారా?" దెబ్బలాడుతున్నట్టుగా గట్టిగా అరిచింది కోపంతో.

ఆశ్చర్యంతో అతని కనుబొమ్మలు పైకి లేచాయి, కొత్త సంగతి ఏదో అప్పుడే వింటున్నట్టు.

"నిన్ను నడిరోడ్డు మీద వదిలేశానా?!"

"మరి! కారు ఎక్కడ ఆపారు?"

"మన యింటి దగ్గర ఆపలేదూ!" అది కూడా తప్పేనా! అన్నట్టు చూశాడు.

'చేసిన పని చక్కగా సమర్థించుకుంటారు ఈ పెద్దమనిషి' అనుకుంది మనసులో!

"యింటి దగ్గర అంటే ఎక్కడ! గేటు

[37వ పేజీ చూడండి]

# సినిమా విశేషాలు



'బంగారు బావ'లో
కృష్ణ, శ్రీదేవి

## పెళ్ళిగోలలో చంటి గోడు

చంటిబాబు (నూతన్‌ప్రసాద్) మంచంమీద కూర్చొని, పేపరు చూస్తూ, "రాజమండ్రిలో నలుగురి దుర్మరణం ... అమ్మో ! ... బల్లిపడిన ఆహారం తిని, రాజమండ్రిలో ఓ తండ్రి, కూతురు, మనవడు, మనవరాలు అక్కడికక్కడే మరణించారు ..." అని చదివాక పేపరు మడిచి, "అంటే, రాజమండ్రిలో టిఫిన్ తింటే, అందులో బల్లులు పడతాయా ? లేక – బల్లిపడిన ఆహారం ఎక్కడ తిన్నా – తిన్నగా వెళ్ళి రాజమండ్రిలో చస్తామా ? ఛ ... ఛ ... అది కాదు పాయింటు. ఆహారం అన్నాక బల్లులు పడతాయి. అదో పాయింటు. అది తింటే, రాజమండ్రిలోనే కాదు; మన రాజధానిలో నైనా చచ్చిపోతాం ... ఇదో పాయింటు," అనుకుంటూండగా నౌకరు టిఫిన్ తెచ్చాడు. "టిఫినా ! నాకొద్దు," అన్నాడు.

నౌకరు చకితుడయ్యాడు. "అదేట బాబూ, యిప్పుడే కదా టిఫిన్ తెమ్మన్నారు ?"

"తెమ్మన్నాను. తెచ్చావు. ఇప్పుడు తీసుకు పొమ్మంటున్నాను పో ! స్టాప్...సిట్ ఈట్... ఈ టిఫిన్ ఈటింగ్ చెయ్యరా !" అంటూ చంటి హుకుంలు జారీ చేశాడు.

"అమ్మో ! తమరు చూస్తుండగా తింటే ..." నౌకరు నసిగాడు.

"నేను తినమంటున్నాను. తిను."

నౌకరు గాభరాతో గబగబ తినసాగాడు. చంటిబాబు అతన్నే తీక్షణంగా చూడసాగాడు ... నౌకరు బాధ భరించలేక మెలికలు తిరుగుతూ నేలమీద దొర్లి ప్రాణాలు విడిచినట్లు చంటిబాబు ఊహించుకుని, అమాంతంగా ఏడ్పు లంకించుకున్నాడు. పురుషోత్తమరావు (రమణమూర్తి), మేనేజరు (సారథి) కంగారుగా వచ్చారు. ఆ గదిలో ఇప్పుడు నౌకరు లేడు. "మన నౌకరు రాజయ్య చచ్చిపోయాడు. అందుకే ఏడుస్తున్నాను," బావురుమన్నాడు చంటిబాబు.

"రాజయ్య చచ్చిపోయాడా ! అదెప్పుడురా ? ఇందాక నాకు టిఫిన్ పెట్టాడుగా ?" అన్నాడు పురుషోత్తమరావు అయోమయంగా చూస్తూ.

"రాజయ్య లాంటి మనిషి జబ్బు, జ్వరం లేకుండా ఎలా చచ్చిపోతాడు ?" మేనేజర్ కూడా విస్మయంలోంచి తేరుకోలేదు.

"విషం కలిసిన టిఫిన్ తింటే చావకేం అవుతాడు ? వాడైనా చస్తాడు. నువ్వయినా చస్తావు," అన్నాడు చంటిబాబు.

"అదంతా నీ భ్రమ. ఉండు. రాజయ్యని పిలుస్తాను," అంటూ పురుషోత్తమరావు పిలవగానే వచ్చిన నౌకర్ని చూసి చంటిబాబు విస్తుపోయాడు. "నువ్వు టిఫిన్ తిని చచ్చిపోలేదూ?" అని అడిగాడు.

"లేదు, బాబూ ! మీరు తినమని అర్డరేశారు. తిన్నాను. మీకు కాఫీ తెద్దామని వంటగదిలో కెళ్ళాను. చచ్చిపోవడానికి నాకు కర్మమెక్కడున్నాదండి ?" అన్నాడు నౌకరు.

చంటిబాబు ఆరున్నొక్క రాగం ఆలపించసాగాడు మళ్ళీ.

"బాబును జాగ్రత్తగా చూసుకో," అని నౌకరుతో చెప్పి, మేనేజర్‌తో బయటకు నడిచాడు పురుషోత్తమరావు.

మురళీమోహన్, గాయత్రి, రాజ్యలక్ష్మి, మోహన్‌బాబు, నాగభూషణం, కాకరాల, మాడా, అత్తిలి లక్ష్మి, జయమాలిని పాల్గొన్న రాజలక్ష్మి కంబైన్స్ "పెళ్ళిగోల" చిత్రాన్ని కట్టా సుబ్బారావు

'పిల్ల జమీందార్'లో
అక్కినేని, టి. జయశ్రీ





'రామాయణంలో
పిడకలవేట'లో దీప

స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో యు. ఎస్. ఆర్. మోహనరావు నిర్మిస్తున్నారు. కాశీ విశ్వనాథ్, సత్యం, వేటూరి, జి. మోహనకృష్ణ, ప్రకాశరావు, వీరప్ప, జి. ఎస్. బాబు, కె. రఘునాథరెడ్డి వగైరా సాంకేతికవర్గం.

## దాసరి దర్శకత్వంలో అన్నపూర్ణ స్టూడియోస్ చిత్రం

వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని నిర్మించే కొత్త చిత్రం షూటింగ్ ఎ. ఎన్. ఆర్., పుట్టిన రోజున – సెప్టెంబర్ 20న సెట్స్‌కు వెళ్తుందని చెప్పారు దాసరి. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వంలో తయారయ్యే చిత్రాన్ని శ్రీమతి అన్నపూర్ణ నాగేశ్వరరావు సమర్పిస్తారు. ఎ. ఎన్. ఆర్., సరసన శ్రీదేవి నాయిక. సెల్వరాజ్ ఛాయాగ్రాహకుడు.

## ఎ.ఎన్.ఆర్, దాసరి, రామానాయుడు

సురేష్ వారి కొత్త చిత్రం జనవరిలో సెట్స్‌కు వెళ్తుందని నిర్మాత డి. రామానాయుడు చెప్పారు. దాసరి రచన, దర్శకత్వంలో ఎ. ఎన్. ఆర్. నటించే మరో చిత్రమిది.



'కేటుగాడు' లో సీను

## గందరగోళంలో

## రంగం సంగతులు

"రమాప్రభ ఓ లాంచి యజమానురాలు. ఆమెకు చిన్నప్పుడే పెళ్ళయింది. పెళ్ళయిన వెంటనే పెనిమిటి రంగూన్‌కు వెళ్ళిపోయాడు. పాపం, రమాప్రభ తన రంగూను భర్త ఎప్పటికైనా రంగం నుంచి తిరిగొస్తాడని ఎదురు చూస్తూంటుంది. ఓ బట్లరు (కె. వి. చలం) తాను రంగూన్ వెళ్ళివచ్చానని, రంగూన్‌లో ఉన్నప్పుడు రమాప్రభ మొగుడితో కలసి తిరుగుతూండేవాడినని కల్లబొల్లి కబుర్లు చెప్తూ, ఆమెవద్ద నుంచి తరచు డబ్బు గుంజుతూంటాడు," అంటూ సన్నివేశాన్ని వివరించారు డైరెక్టర్ సింగీతం శ్రీనివాసరావు.

"మా పిక్చర్‌లో రమాప్రభ పేరు రమాప్రభే!" అంటూ మూవియోలాను స్టార్ట్ చేయించారు నిర్మాత ఎం. కె. మావుళ్ళయ్య.

రమాప్రభ లాంచి దిగి, హడావిడిగా ఊరి వైపు పరుగుతీస్తోంది ... దూరం నుంచి ఆమెను చూసిన బట్లరు "ఎట్టాగా అనుకుంటే, సినిమా కర్పు పరుగెత్తుకొస్తోంది ... నా మనీపర్సు, బంగారు గుడ్డెట్టే నా బంగారు బాతా! సమయానికి తగిలావ్, రంగం అత్తా!" అంటూ ఆమె దగ్గరికెళ్ళాడు

"యేంటి యిసయం? అవతల అర్జంటు పనుంది," అంది రమాప్రభ.

"వుంటే యెల్లు—వాకేటి! వూళ్ళో లేటెస్టు పిచ్చరు—అదే రంగం సంగతులు లేటెస్టుగా తెలిశాయి. నీకు చెబితే హేపీ అవుతావని —"

"రంగం సంగతులా! ఏం తెలిశాయ్? ఆయన ఊసేమన్నా తెలిసిందా? తొందరగా చెప్పవయ్యా!"

"ఏం లేదు ... ఆః ... ఆః ..." అంటూ బట్లరు ఆమె బొడ్డున ఉన్న డబ్బు సంచీకేసి ఆశతో చూడసాగాడు. ఆమె వెంటనే ఆ సంచీ లోంచి డబ్బు తీసి ఇచ్చేసరికి, "థాంక్యూ! థాంక్యూ! ... మొన్న మీ ఆయన మీసం తీసేశాడని చెప్పాకదూ? యిప్పుడు కోరమీసం పెంచుతున్నాట్ట!" అన్నాడు.

ఊహా లోకాల్లో తేలిపోతూన్న రమాప్రభ ముఖం విప్పారింది. "మీసం లేకపోతే మొహం బోసిపోద్దిగాని, కోరమీసంలో దొరబాబులా ఉంటాడు."

"అదే లేటెస్టు ... మరి, నే వస్తా!" అంటూ బట్లరు జారుకున్నాడు.

మురిసిపోతూ ముందుకు సాగింది రమాప్రభ.

లక్ష్మీనరసింహా ఇంటర్నేషనల్ వారి "గందరగోళం"లో మోహన్—శిల్ప, రాజ్‌కుమార్—శ్రీశైలజ, లక్ష్మీప్రసాద్—లక్ష్మీచిత్ర మూడు జంటలు ముచ్చటగా నటించారు. శ్రీ రమణ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, జి. కె. రాము ఛాయ ఇతర ఆకర్షణలు. సెప్టెంబర్ 5న విడుదలవుతుంది.

—జి.వి.జి




చట్టబద్ధమైన హెచ్చరిక:
సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం
STATUTORY WARNING:
CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

**1 రూపాయికి 10***

*గరిష్ఠ ధర స్థానిక పన్నులను అనుసరించి

CASVS-238-234 TI

**మెయిన్ డీలరు : టి. కోటేశ్వరరావు & సన్స్, గుంటూరు.**



## సినిమా

### సర్దార్ పాపారాయుడు

ఎన్. టి. ఆర్. ద్విపాత్రాభినయం నిర్వహించే శ్రీ అన్నపూర్ణ ఇంటర్నేషనల్ వారి పై చిత్రంలో ''సత్యం, ధర్మం, న్యాయంగా – సత్యనారాయణ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య విచిత్రమైన పాత్రల్లో కనిపిస్తారు,'' అన్నారు దర్శక రచయిత దాసరి. శారద, శ్రీదేవి, గుమ్మడి, అత్తిలి లక్ష్మి తక్కిన ప్రధాన నటవర్గం. చక్రవర్తి, ఎస్. వెంకటరత్నం, భాస్కరరాజు, జి. జి. కృష్ణారావు, సలీం, కోటేశ్వరరావు, మల్లీశ్వరరావు, రమణబాబు, కనకేశ్వరరావు తెరవెనుక కృషి చేస్తున్నారు. ''రెండో షెడ్యూల్ పూర్తయింది. సెప్టెంబర్ 1 నుంచి 10 వరకు ఊటీలో జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది,'' అన్నారు నిర్మాత క్రాంతికుమార్.

### చివరి ఘట్టంలో సంధ్య

''తపస్య'' హిందీ చిత్రం ఆధారంగా ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో ఎ.ఆర్.ఎస్. శర్మ సమర్పించే శ్రీ సావరిన్ ఫిలిమ్స్ ''సంధ్య'' చిత్రం ఆగస్టు 16 నుండి 26 వరకు జరిగే రెండవ షెడ్యూల్‌తో 90 పర్సెంట్ పూర్తవుతుందన్నారు నిర్మాత కంచర్ల పూర్ణచంద్రరావు. చంద్రమోహన్, శ్రీధర్, సుజాత, గీత, దావన, నిషి, జయవిజయ, బేబీ వరలక్ష్మి, గుమ్మడి, కాంతారావు, అల్లు రామలింగయ్య, కె.కె. శర్మ, మాస్టర్ పింకీ, గెస్ట్‌గా జగ్గయ్య నటిస్తున్నారు. జంధ్యాల, చక్రవర్తి, గోపాలరెడ్డి, నాయని మహేశ్వరరావు, భావనారాయణ, పద్మనాభం, రాధాకృష్ణారెడ్డి తెరవెనుక పని చేస్తున్నారు.

'సర్దార్ పాపారాయుడు'లో ఎన్. టి. ఆర్.

## మళ్ళీ జెమినీ బాకా వినిపిస్తుంది!

"చిత్ర నిర్మాణంతోపాటు పంపిణీ కూడా మా సంస్థ చేపడుతుంది. సినిమా పత్రికలు వెలువరించే ఉద్దేశ్యం కూడా ఉంది," అన్నారు జెమినీ పిక్చర్స్ సర్క్యూట్ ప్రైవేట్ లిమిటెడ్ జాయింట్ మేనేజింగ్ డైరెక్టర్ అయిన శ్రీ పళనియప్ప రామస్వామి. సినిమారంగంలో జెమినీ సంస్థకున్న కీర్తి ప్రతిష్ఠలు ఎవ్వరికీ తెలియనిది కాదు. వాటిని ద్విగుణీకృతమయ్యేలా కృషి చేయడానికి అనుకున్నట్లు తెలియజేశారాయన.

ఇప్పుడు జెమినీ లాబొరేటరీ అత్యాధునికమైన సాంకేతిక పరికరాలను సమకూర్చుకుంది. 'కార్టర్ టోటల్ ఇమ్మర్షన్ డేలైట్ వెట్ ప్రింటర్' ఆసియాఖండంలో కెల్లా జెమినీవద్దనే ఉంది. ఏ మాత్రం గీతలు పడకుండా షార్ప్‌గా ఉన్న స్పష్టమైన ప్రింట్లు ఇస్తుందీ యంత్రం. 'బెల్ అండ్ హోవెల్ మాడ్యులర్ ప్రింటర్' నిమిషానికి 900 అడుగుల చొప్పున మేలురకపు ప్రింట్లు ఇస్తుంది. 'జి. ఎం. ఎఫ్. కన్వర్షన్ ప్రింటర్' ద్వారా సినిమాస్కోప్ నెగెటివ్‌ల నుంచి 35 మిల్లీమీటర్ల ప్రింట్లు, 35 మిల్లీమీటర్ల నెగెటివ్‌ల నుంచి సినిమాస్కోప్ ప్రింట్లు తీయడానికి వీలవుతుంది. ఇండియాలో ఇలాంటి సదుపాయంగల లేబరేటరీ ఇదే! 'హేజెల్ టైన్ కలర్ ఫిలిమ్ ఎనలైజర్' ద్వారా ప్రతి షాట్‌లోని కలర్ డెప్త్‌ను సవరించడానికి వీలవుతుంది. ఇది ఎలెక్ట్రానిక్, కంప్యూటర్ సాధనం. 'వెడెట్టా వ్యూయర్'లోని మినియేచర్ స్క్రీన్‌ద్వారా ధ్వని, దృశ్యాల క్వాలిటీని పరిశీలించవచ్చు. ఆరితేరిన సాంకేతిక నిపుణులుగల ఈ లేబరేటరీలో ఎన్నో హిట్, అవార్డ్ చిత్రాలు ప్రాసెస్ చేయబడ్డాయి. యావద్భారతదేశంలో ఆర్వో కలర్ ప్రాసెసింగ్ చేసే లేబరేటరీ ఇదొక్కటే. 16. ఎం. ఎం., సినిమాస్కోప్ ఫిలిమ్‌లను ప్రాసెస్ చేసే ఘనత కూడా జెమినీకే దక్కింది. "ఇటుపైన 24 గంటల్లోనే ఎక్స్‌పోస్డ్ నెగెటివ్‌లను డెవలప్ చేసి, డెలివరీ చేయగలం. రష్ ప్రింట్లను 72గంటల్లో ప్రాసెస్ చేసి, డెలివరీ చేయగలం," అన్నారు శ్రీ పళనియప్ప రామస్వామి.

'ఆశాజ్యోతి'లో
సత్యప్రకాశ్, సుజాత



**ఆశాజ్యోతి**

"రెండో షెడ్యూల్ ఆగస్టు 25 నుండి మొదలవుతుంది. దీంతో ఫిఫ్టీ పర్సెంట్ ఫినిషవుతుంది," అన్నారు దర్శక నిర్మాత తాతినేని ప్రకాశరావు. అనిల్ ప్రొడక్షన్స్ "ఆశాజ్యోతి"లో మురళీమోహన్, శ్రీధర్, శరత్‌బాబు, జగ్గయ్య, రావు గోపాలరావు, మిక్కిలినేని, పి. ఎల్. నారాయణ, రావి కొండలరావు, బాలకృష్ణ, సుజాత, నిర్మల, టి జి. కమల, అత్తిలి లక్ష్మి, మాస్టర్ తాతినేని సత్యప్రకాష్, గెస్టులుగా హరిప్రసాద్, కృష్ణవేణి నటిస్తున్నారు. జంధ్యాల, రమేష్‌నాయుడు, సి. నారాయణరెడ్డి, వేటూరి, విన్సెంట్, తోట, కణ్ణన్, కృష్ణజీ, కృష్ణమూర్తి, మహందాత, యు. ఎస్. వి. పాణి ప్రభృత సాంకేతికవర్గంతో టి. ఎల్. వి. ప్రసాద్ సమర్పిస్తున్నారు.

'కొత్త జీవితాలు'లో
సుహాసిని

# అందాలహరివిల్లు

# ఆప్కో అపూర్వసృష్టి

ఆప్కోవారి అత్యద్భుతమైన వస్త్రాలు ధరించి అందరినీ ఆకట్టుకోండి. సిల్కు వస్త్రాల జిలుగులు; నూలు, పాలియస్టర్ జనతా చీరలు, ధోతీల తళుకులు – అందాలను ఇనుమడింప జేస్తాయి – అవే ఆప్కో.

ది ఆంధ్రప్రదేశ్ స్టేట్
వీవర్సు కోపరేటివ్ హేండ్లూం
సొసైటి లిమిటెడ్
నారాయణగూడ, హైదరాబాద్.




KIRON/APCO/8018

( గత సంచిక తరువాయి )

























[ఇంకా ఉంది]



## సినిమా

### వై జయంతీ కంబైన్స్

"ఆగస్టు 28న షూటింగ్ మొదలెడుతున్నాం," అన్నారు కె. బాపయ్య. ఈయన దర్శకత్వంలో అశ్వనీదత్ నిర్మించే చిత్రంలో ఎ. ఎన్. ఆర్ — సుజాత, కృష్ణ — శ్రీదేవి, సత్యనారాయణ, నాగభూషణం ముఖ్య తారాగణం. జంధ్యాల, మహదేవన్, ఆత్రేయ, వేటూరి, పి. ఎల్. రాయ్, కృష్ణ, రాజు, కె. మురళి ప్రభృత సాంకేతికవర్గం. మొదటి గీతం ఆగస్టు 13న ధ్వనిముద్రిక చేయబడింది.

### శ్రీకృష్ణ సంగీత తరంగాలు

దైనందిన వ్యవహారాలలో సదా మునిగి తేలుతూన్న మద్రాసాంధ్రులకు కించిత్తు దైవచింతన కలిగించే ఉద్దేశ్యంతో లోగడ మార్చి 24న శ్రీరామనవమినాడు త్యాగరాజ సంగీతోత్సవాన్ని భక్త జనరంజకంగా జరిపిన మద్రాసు పౌర సమితి వారు ఆగస్టు 31న గోకులాష్టమినాడు శ్రీ స్వామి శంకర్‌దాస్ ఆడిటోరియమ్‌లో కృష్ణజయంతిని జరుపనున్నారు. శ్రీ పి. ఎల్. నరసింహమూర్తి, శ్రీమతి పి. విజయలక్ష్మిగార్ల సంస్కృత భాగవత చిత్రకళా ప్రదర్శనతోపాటు సంగీతోత్సవం కూడా ఈ 'సప్తాహం'లో ఒక భాగం. 'శ్రీకృష్ణ సంగీత తరంగాలు'కు డాక్టర్ ఎం. బాలమురళీకృష్ణచే ప్రారంభోత్సవం జరుగుతుంది. సి. హెచ్. నరసింహులు—క్లారియోనెట్, డాక్టర్ ఎన్. రమణి—మురళి, చిట్టిబాబు—వీణ, ద్వారం మంగతాయారు—వయొలిన్, భక్తిగీతాలను పి. బి. శ్రీనివాస్, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, జేసుదాసు, సుశీల, జానకి, వాణీజయరాం, శైలజ, విజయలక్ష్మిశర్మ, పద్మ, జి. బాలకృష్ణప్రసాద్, ఎస్. రాజేశ్వరరావు గానం చేస్తారు. "కూచిపూడి ఆర్ట్ అకాడమీ ఆధ్వర్యంలో నర్తకీమణి బాలచే 'కృష్ణ అభినయం' మరో ఆకర్షణ," అని టి.వి.కె.శాస్త్రి తెలియజేశారు.

'పండంటి జీవితం'లో శోభన్‌బాబు, జయమాల

---

## ఇరుగు - పొరుగు తమాషాలు

"పేరు ముందు 'జయ' గల మొట్టమొదటి తారను నేను," అంటుంది జయచిత్ర. "నా అసలు పేరు ఎంత పొడుగో తెలుసాండీ? 'లక్ష్మి కృష్ణవేణి రోహిణి పార్వతీదేవి' ఇది నా పూర్తి పేరు. 'రోహిణి' స్కూల్‌లో వ్యవహార నామం. శుక్రవారంనాడు — కృష్ణ జయంతినాడు రోహిణి నక్షత్రంలో పుట్టాను. శుక్రవారం — శుభప్రదమైనది. అంచేత నా పేరులో 'లక్ష్మి' చేర్చారు. కృష్ణజయంతి గనుక, కృష్ణవేణి — అని, ఇక నక్షత్రం 'రోహిణి'. మా అమ్మ కర్పగాంబాళ్ భక్తురాలు. అంచేత 'పార్వతీదేవి' అని కూడా కలిపారు. దాంతో నా పూర్తి పేరు చేంతాడంత అయింది. ఈనాటికి కూడా మా అమ్మమ్మ నోరారా ఇంత పెద్ద పేరును పిలుస్తుంది! నాకే ఒక్కోసారి వినడానికి సిగ్గుగా ఉంటుందనుకోండి. ఇంతకీ, ఈ పేరు జయచిత్రగా ఎలా మారిందంటారా?

అలా మార్చింది డైరెక్టర్ కె. ఎస్. గోపాలకృష్ణన్‌గారు. 'రోహిణి — అనే పేరు బాగాలేదమ్మా. మార్చాలి,' అన్నారాయన. నేనింటికి వెళ్ళాక ఫోన్ చేసి, 'జయచిత్ర' అనే పేరు చక్కగా ఉంటుంది. జయ — అంటే విజయం. అది పేరు ముందుండడం మంచిది కదా? కొత్తదనంగా కూడా ఉంటుంది,' అన్నారాయన. 'ఓ—కే' అనేశాను..."

* * *

రతి బొంబాయిలో బంగళా కొనుక్కొని అక్కడే స్థిరపడిపోడానికి నిశ్చయించుకుంది. ఇప్పుడామె దృష్టి అంతా హిందీ చిత్రసీమ మీదుంది. 'మరో చరిత్ర' హిందీ పరివర్తనంలో నటిస్తూండగానే అయిదు హిందీ చిత్రాల్లో బుక్ అయింది. 'త్రివేణి'లో రాజ్‌బాబర్ సరసన, 'సరోస్'లో సునీల్‌దత్ నాయికగానూ నటిస్తోంది. "చిన్నప్పుడు నేను సునీల్‌జీగారి పిల్లలతో ఆడుకునేదాన్ని. అప్పుడు మేం బొంబాయిలో ఉంటూండేవాళ్ళం. మా నాన్న, సునీల్‌గారు స్నేహితులు. 'ఏయ్, రతీ, మై చైల్డ్. నువ్వే నా వుడ్ బీ హీరోయిన్' అని వేళాకోళంగా అంటూండేవారు సునీల్‌జీ — చివరికి ఆయన వాక్కు ఫలించింది," అంది రతి నవ్వుతూ.

* * *

శివాజీగణేశన్ ఒక నటికి తండ్రిగా, భర్తగా, అన్నగా, తమ్ముడుగా నటించారు. ఆ తమిళ నటి పేరు విజయకుమారి. తండ్రిగా "పార్ మగళే పార్"లో, భర్తగా "రాజరాజ చోళన్"లో, అన్నగా "పచ్చయ్ విళక్కు"లో, తమ్ముడుగా "అన్‌బై తేడి"లో నటించారు.

# మువ్వల మురళి

[ 25వ పేజీ తరువాయి ]

లోపల పార్టికలో ఆగిందా! గేటు అవతల రోడ్డు మీద ఆపేసి కారు దిగి నన్ను లోపలకు పొమ్మని, అవతల ఎక్కడో కొంపలు తగిలడు పోతువున్నట్టు రయ్యిన పారిపోయారు. నాకు మాట అయినా చెప్పారా ?''

''నేను ఎక్కడికి వెళ్ళానో నీకు ఏమైనా తెలుసా ? ఒకకేసు గురించి నేను అర్జంటుగా ఒకరితో మాట్లాడవలసి వచ్చి వెళ్లిపోయాను'' చాలా శాంతంగా చెప్పాడు, ఈ విషయంలో నా తప్పు ఏంలేదు అని ఋజావు చేసుకోవడానికి తాపత్రయ పడుతున్నట్టుగా !

''ఆ సంగతి నాకు చెప్పవచ్చుగా ?''

''చెప్తే ఏంచేస్తావు ? నాకూడా బయలుదేరి వస్తావా ! లేక ఆ కేసు నువ్వు తీసుకుంటావా !'' శాంత గంభీర స్వరంతో ప్రశ్నించాడు.

భర్త తనని ఆ అడిగే తీరు హేళన చేస్తున్నట్టుగా, అవమానంగాతోచాయి ఆమాటలు.

''ఓహో! అయితే మీ దృష్టిలో భార్య అంటే ఓ మైనపు బొమ్మ అన్నమాట. మీరు ఏం మాట్లాడినా, ఎక్కడికి వెళ్ళినా, ఏ పని చేసినా ఉలక్క పలక్క కూర్చునే పాలరాతి బొమ్మ అన్న మాట !'' అంటూ ఒక్కొక్క మాట నొక్కి పలుకుతూ అంది.

''హరితా '' అతని కంఠం ఒక్కసారి మామూలుగా మారిపోయింది.

''మగవాడికి ఎన్నో పనులు వుంటాయి. ఇరవైనాలుగు గంటలూ భార్యకి ఎదురుగా కూర్చోవాలి అంటే ఎలా కుదురుతుంది చెప్పు! భార్యగా భర్తని అర్థం చేసుకోవాలేగాని ప్రేమాను రాగాలతో అతన్ని శాసించి, కట్టిబంధించకూడదు.''

హరిత మరి మాటలు పెంచదలుచుకోలేదు. వాదించే కొద్దీ వాదన పెరుగుతూనే వుంటుంది. భార్యాభర్తల్లో ఎవరో ఒకరు తగ్గిపోవటమేమంచిది. అనవసరంగా గొడవ పెంచుకున్నట్టు అవుతుంది. మనసులో అనుకున్న హరిత అక్కడనుండి వెళ్ళిపోయింది.

కృష్ణసుమంత్ కోర్టుకి వెళ్తూ చెప్పాడు - ''సెకండ్ షో సినిమాకు వెళ్దాం ఈరోజు. శరత్‌లో సినిమా బాగుందట.''

ఆమె మాట్లాడలేదు, మౌనంగా వుండి పోయింది.

ఇప్పుడే కదా అతనితో దెబ్బలాడింది. సినిమా అనగానే ఎగిరిగంతేసి, అంగీకారం తెలియచేస్తే భర్తకు తను చులకన అయిపోదూ! అందుకే అతను మళ్ళీ అడిగితే — ''చూద్దాం'' అందిబింకంగా.

కృష్ణసుమంత్ కోర్టుకి వెళ్లిపోయాడు.

అతనికి కోర్టు పనులవల్ల ఎక్కడా తీరిక వుండదు. అందుకే ఎప్పుడైనా సినిమాకు వెళ్ళాలి అంటే మంచి సినిమా అయితే సెకండ్ షోకి భార్యని తీసుకుని వెళ్తుంటాడు.

*   *   *

కారు ఆగిన శబ్దం అవటంతో రోజా వీధిలోకి వచ్చి చూసింది. కృష్ణసుమంత్ కారు దిగి లోపలకు రావటం కనిపించింది. అవుకోలేని సంతోషంతో అలవాటు ప్రకారం వెళ్ళి అతన్ని చుట్టేసింది. అతను చిరునవ్వుతో ఆమెను అలాగే దగ్గరకు తీసుకుని లోపలకు నడిచాడు.

''రోజా !'' మృదువుగా పిలిచాడు.

''ఊఁ'' నిలబడే శక్తిలేనట్టు అతని భుజం మీద తలవాల్చేస్తూ అంది.

''ఈ క్షణములో నువ్వు ధైర్యంగా వుండాలి.''

ధైర్యం అనే మాట చెవులకి సోకగానే కళ్ళు పైకెత్తి అతని ముఖంలోకి చూసింది. ముఖం నల్లగా అయిపోయి కళ్లు కాంతి విహీనంగా అయ్యాయి.

అతన్నుంచి దూరంగా వెళ్ళిపోయి కిటికీ దగ్గర నిలబడింది.

''ధైర్యం ఎలా వస్తుంది! అమ్మ చూస్తే హాస్పటల్‌లో వుంది. నాకు రోజు రోజుకీ జీవితం అంటే విరక్తి కలిగిపోతూంది. ఈ ఒంటరి జీవితం నాకు దుర్భరంగా వుంది'' అంది వెక్కి వెక్కి ఏడుస్తూ !

''రోజా !'' ఆమెవైపు కంగారుగా చూశాడు.

ఆమె అలా వెక్కి వెక్కి ఏడుస్తూనే వుంది.

కృష్ణసుమంత్ మనసు అంతా జాలితో నిండిపోయింది. దగ్గరగా వెళ్ళి ఆమె భుజాలు పట్టుకుని, ''రోజా! నువ్వు ఒంటరిదానవు ఎలా అవుతావు ! నేను లేనా ?''

ఆమె మాట్లాడలేదు. మౌనంగా రోదిస్తూ అలా వుండిపోయింది.

/ఇంకా వుంది/




బృందావన్ ఎక్స్‌ప్రెస్ బయలు దేరబోతోంది. ప్రయాణీకుల తలలు, చేతులు కిటికీలలో నుంచి బయటకువచ్చి ప్లాట్‌ఫారం మీద నిలబడి వీడ్కోలు చెబుతూన్న వాళ్లను పలుకరిస్తున్నాయి.

అంతకు ముందు వుండిన కోలాహల వాతా వరణం తారస్థాయిని అందుకున్నది.

తరువాత ప్రయాణీకులు ఎవరి స్థానాలలో వాళ్లు సర్దుకుంటారు. రిజర్వేషన్ లేనివాళ్లు టి. టి. ఐ. ని పట్టుకుని అతని దగ్గర రూపాయి పావలా చీటీ సంపాదించేంత వరకు అతన్ని అనుస రించి వుంటారు. ముందుగానే స్థలం కేటాయింపు అయిన వాళ్లకు యీ బాదరబందీ వుండదు. సామాను భద్రంగా సీటు కిందనో, పైనవుండే చిన్న అరమీదనో పెట్టేసుకుని ఇడ్లీల పొట్లం విప్పుకోవచ్చును. లేకపోతే న్యూస్ పేపర్ పుటలు విప్పుకుని రాజకీయాలలో మునిగిపోవచ్చును. ఏమయినా ఒక అరగంట వరకు కంపార్ట్‌మెంట్ లోనివాళ్లు సర్దుకునే కోలాహలం, చప్పుళ్లు వినిపిస్తూనే వుంటాయి. ఎంత వద్దనుకున్నా ఎవరో ఒకరు బుజం రాచుకుని పక్కనుంచి నడుస్తూనేవుంటారు. చుట్టూవుండే జనాన్ని గమనిస్తూ కూర్చుంటేచాలు, మధ్యాహ్నం ఒంటి గంటకల్లా బెంగుళూరు చేరుకోవచ్చును.

యమున, సుందరం ఒక పక్కగా కూర్చున్నారు. మూడో సీటు ఖాళీగావుంది. ఎదురుగా వున్న 'త్రీసీటర్'లో ఇద్దరు ఆడవాళ్లు, యిద్దరు పిల్లలు కూర్చున్నారు. చేతిలోని పుస్తకం పేజీలు తెరిచివున్నాయి. కాని సుందరం ధ్యాస ఎదురుగుండా వున్న పిల్లలమీద వుంది. కుర్రవాడికి ఏడెనిమిదేళ్లకంటె వుండవు. అమ్మాయికి నాలుగేళ్లు వుండవచ్చు. ఇద్దరూ ముద్దు వస్తున్నారు, రత్నమాణిక్యాల లాగ. వాళ్ల పక్కన కూర్చున్నామె, బహుశ తల్లి అయివుంటుంది. అంతకంటె వయసు అయినామెతో మాట్లాడుతూ కూర్చుండిపోయిందిగాని పిల్లల విషయం పట్టించు కోవడంలేదు. రత్నమాణిక్యాలు సన్నగా కీచులాడు కుంటున్నారు.

'నాన్నగారు యిచ్చిన క్యాడ్‌బరీస్ చాక్‌లెట్ నేను ఒక్కడినే తినేస్తాను' అంటున్నాడు కుర్రవాడు.

'నీ దగ్గరలేదుగా. అమ్మ దాచేసింది. అమ్మ నాకూ సగం యిస్తుంది. నువ్వేం గొప్పలు చెప్పకు—' అని అమ్మాయి బదులుచెప్పేసి వూరు కుంది, కొత్తగా సవాలు యేమీ చేయకుండా. ఎలా గయినా చెల్లెలును పౌరుష పడేట్లుచేసి తమాషా చూడాలని కుర్రవాడు పంతం పడుతున్నాడు. కాని అమ్మాయి అతి ప్రశాంతంగా వుంది. చివరకు వాడు, 'రేపు మనకు పుట్టే చెల్లాయితో నేనే ఆడుకుంటాను—నిన్ను దగ్గరికేనా రానీయను' అన్నాడు.

'చాల్లే, పుట్టేది తమ్ముడు—చెల్లాయికాదు. కావాలంటే అమ్మనడుగు. వాడేం నీలా అల్లరి బాజాకాదు. నాతోనే ఆడుకుంటాడు. నువ్వు దగ్గర కొచ్చావంటే ఉప్పపోసేస్తాడు—'

సుందరానికి నవ్వువచ్చింది. కొద్దిగా పైకి కూడా నవ్వేశాడేమో, యమునే కాకుండా ఎదురు బెంచీమీద ఆడవాళ్లు యిద్దరూ అతని వంక చూశారు. సుందరం తమాయించుకుని ఆ పిల్లల తల్లివంకే చూశాడు. ఆమె గర్భవతి అన్నవిషయం అప్పుడే గమనించాడు.

'ఎందుకు నవ్వుతున్నారు ?' అని అడిగింది యమున.

'ఏదో గుర్తు వచ్చిందిలే—ఆఫీసు విషయం' అని, చూపు పుస్తకంమీదికి మళ్లించాడు. పిల్లల గురించి యమునతో ప్రస్తావించడం అతని భయం అంతేకాదు. ఆ పిల్లల తాలూకు పెద్ద వాళ్లు కూడా వున్నారు. వాళ్లుయేమనుకుంటారు

'ఈ నాలుగు రోజులన్నా ఆఫీసు మర్చిపోరా? అంది యమున తానూ నవ్వుతూ.

ఎదురు సీట్లో కూర్చున్నామె చొరవగా 'మగవాడు కట్టుకున్న భార్యనయినా మరచిపోతాడు గాని ఆఫీసు మర్చిపోడమ్మా. మా అల్లుడి సంగతే చూడు. సెలవు మురిగిపోతోందని అంటావు గాని నాయనా, మాతోపాటు బెంగుళూరులో రెండు నెలలు విశ్రాంతిగా వుండు—అని ఎంత చెప్పినా వినిపించుకోడు. మళ్లీ ప్రతి శని, ఆదివారాలు రైలు వాళ్లకు బోలెడంత డబ్బుపోసి వచ్చి వెడుతూ వుంటాడు—' అంది.

భార్యాభర్తల మాటలు తాను 'ఓవర్ హియర్' చేసి మాట కలుపుతున్నానన్న బిడియమే లేదు ఆమెకు—అనుకున్నాడు సుందరం. యమున వయిపు చూస్తూ ముసిముసిగా నవ్వాడు.

అయితే వాళ్లు యిద్దరూ తల్లీ, కూతుళ్లన్న మాట. కూతుర్ని పురిటికి తీసుకు వెడుతూ వుంటుంది. యమున ఈ మారు యిద్దరి వంక పరిశీలనగా చూచింది. కూతురుకు తన వయస్సే వుంటుంది. ఆమే యమునను చూచి పలక రింపుగా నవ్వుతూ వుండిపోయింది.

'పురిటికి మళ్లీ వాళ్లవూరు పంపేస్తారా పిన్నిగారూ ?' అంది పెద్ద ఆమెను వుద్దేశించి యమున.

'కాదమ్మా. పురిటికే తీసుకువెడుతున్నాను.' ఆమె కంఠం కాస్త రుద్ధం అయింది. 'యిది మూడో పురుడు కాదమ్మా. నాలుగోది. రెండేళ్ల క్రితం వాళ్ల వూళ్లోనే పురుడు పోశారు, అమ్మాయి అత్తవారు. పిల్లవాడు దక్కలేదు. అందుకనే ఆపరేషన్ చేయించుకోవద్దని బలవంతం చేశాం,' అంది.

'అలాగాండి. పాపం. తొందరపడి అడిగి మీ మనసుకు కష్టం కలిగించాం. క్షమించండి—' యమునకు మనసులో కాస్త అసూయ అనిపించింది. ఆ పిల్ల తన యీడుదే. అప్పుడే నాలుగు కాన్పులు !

'అదేం కాదమ్మా. మనకెంత ప్రాప్తమో అంతే. ఇంతకూ బెంగుళూరులో మీరు వుండేది ఎక్కడమ్మా ?'

'కాదండి. మాది మదరాస్. కొద్దిగా పనిబడి బెంగుళూరు వెడుతున్నాం.' ఎంతో బెరుగ్గా అంది యమున.

'అలాగామ్మా. మంచిది—'

'బెంగుళూరు వెళ్లేబండి అంటే అంతా కన్నడం మాట్లాడతారేమో. నాకు భాషరాదు, యేం యిబ్బంది పడతామో అనుకున్నాం. మీరు తెలుగువాళ్లే దొరికారు, మా అదృష్టం కొద్దీ. రైలు పొడుగునా ఇంక మాకు మాంచి కాలక్షేపం.'

'మీకేం ఆ బెంగ అక్కర్లేదమ్మా. బెంగుళూర్లో కూడా సగంమంది పైగా తెలుగు మాట్లాడే వాళ్లే. మాట యేదయితేనేం తల్లీ మనసులు ఒకటవాలిగాని—' అన్నది ఆమె తాత్త్వికధోరణిలో.

—'ఈ మాత్రం వివేకం రాజకీయాలలోని వాళ్లకు వుంటే యెంత బాగుండును' అనుకున్నాడు సుందరం.

ఆడవాళ్ళు పిచ్చాపాటీ మాట్లాడుకోవడంలో పడిపోయినారు. సుందరం పుస్తకంలో మునిగి పోయాడు.

ఇంతలో కాంటీన్ సర్వీస్ బాయ్ కాఫీ పట్టుకువచ్చాడు. సుందరం తనో కప్పు తీసుకుని, యమునకు మరో కప్పు అందించాడు. 'వాళ్లూ తీసుకుంటారేమో కనుక్కో' అన్నాడు. యమున తన చేతిలోని కప్పు యెదురుగా కూర్చున్నామెకు అందించి మరో కప్పుకోసం చేయి చాచింది. సుందరం అందరికీ కప్పులు అందించాడు. వాళ్లు యమునకు 'థాంక్స్' చెప్పారు. వద్దంటూన్నా అన్నిటికీ సుందరమే డబ్బు యిచ్చేశాడు.

'మీరు ఫ్రీగా మాట్లాడుకోండి. నేను అటు, యిటు తిరిగి వస్తాను' అని రహస్యంగా యమున చెవిలో చెప్పి సుందరం పేపరు పక్కకు నెట్టి లేచినిలుచున్నాడు.

'తొందరగా వచ్చేయండి' అంది యమున, అతనికి మాత్రమే వినబడేటట్లు.

సుందరం ముందు పెట్టెల్లోనికి నడిచాడు. అందరూ దాదాపు తమ తమ సీట్లలో సెటిల్ అయిపోయి కూర్చున్నారు. అక్కడక్కడ నలుగురయిదుగురు చేరి పేట్లపేక కూడా ఆడు కుంటున్నారు. ఎవరి లోకం వాళ్లది.

'బృందావనమది అందరిదీ' అనుకున్నాడు సుందరం. వెంటనే గోవిందుడు కూడా అందరి వాడేనా ? — అని అనుమానం వచ్చింది. ఏమో !

రెండు మూడు పెట్టెలు దాటిన తర్వాత ఎరిగివున్న ముఖం కనిపించింది. ఆయన సుందరాన్ని తన పక్కన కూర్చోమన్నాడు.

'ఎందాకా వెడుతున్నారని అడగడం అనవసరం. బెంగుళూరులో మీ అబ్బాయి దగ్గరకే వెడుతున్నారనుకుంటాను' అన్నాడు సుందరం.

ఆయన గట్టిగా నవ్వేశాడు.

సుందరం ఆయనను బాగా ఎరుగును. ప్లీడర్ చేసి సామాన్యంగా సంపాదించాడు. ఇప్పుడు కోర్టుకు వెళ్లడంలేదు ఇద్దరు కొడుకులు. పెద్దచదువులు చెప్పించాడు. మంచి సంబంధాలు చూసి పెళ్లిళ్లు చేశాడు. ఇద్దరూ మంచి ఉద్యోగాల్లో వున్నారు. కాని దగ్గరా దాపూ కాదు. ఒకడు ఉత్తరం అయితే మరొకడు దక్షిణం. స్వగ్రామంలో పిత్రార్జితం ఒక ఇల్లు వుంది. ఆయన మాత్రం అక్కడే వుండిపోయినాడు.

'ఇదో మాయ ప్రపంచం సుందరం కొడుకయేది, తండ్రియేది యెవడి బాధలు వాడు పడవలసిందే —' అన్నాడు ఆయన.

'చాల బాధలు పడిపోతున్నట్లు మాట్లాడు తున్నారే !'

'బాధలంటే — శారీరకమయినవేనా ?'

— సుందరానికి నిజమే అనిపించింది. అంతే కాదు. ఆయన తన ధోరణి సాగిస్తున్నాడని భయం వేసింది.

మాట్లాడడం మొదలుపెడితే జీవితం నుంచి

# ఎవరికి వారే !

అతి తేలికగా వేదాంతంలోనికి 'షిఫ్ట్' అయిపోతాడు.

'ఈ వృద్ధాప్యం హాయిగా కొడుకుల దగ్గర గడిపివేస్తే ఎంత బాగుండును — అనుకుంటాను. కాని ఎలా సాధ్యం? వాళ్ల ఉద్యోగాలు వదులుకుని రాలేరు గదా ! నేనూ, నా భార్య పల్లెటూరి ఇల్లు వదలి బయటకు రావటానికే భయపడతాం.'

'ఎక్కడ వుంటేనేంలెండి. మీ కుర్రవాళ్లు మిమ్మల్ని వెయ్యి కళ్లతో కనిపెట్టుకు వుంటారు.'

'వెయ్యి దేనికి మహాత్మా. ఉన్న రెండూ చూచుకుంటే చాలు — ' అని కాస్సేపు ఆగి ఆయన 'కొడుకులు డబ్బు పంపిస్తారు. కాని ఒక షరతు. అడిగితేనే పంపిస్తారు. అడిగిన 'చాల రోజులకుగాని పంపరు — '

సుందరం యేమీ మాట్లాడలేదు.

ఇద్దరూ మళ్లీ కాఫీ తాగారు.

'నువ్వు ఎన్నయినా చెప్పు. ఈ రోజుల్లో మరో మనిషి మీద ఆధారపడటానికి లేదు. కొడుకయ్యేది, తండ్రియ్యేది — ఎవరికి వారే !' అన్నారాయన, సుందరం యేమీ చెప్పకపోయినా.

'కాని మనిషి సంఘజీవి కదండీ !'



'నిజమే. ప్రతిమారూ తన సంఘాన్ని, తాను పునర్నిర్మించుకుంటాడు.' అన్నాడు ఆయన అదోరకంగా నవ్వుతూ.

సుందరం యేమీ బదులుచెప్పలేదు. మళ్లీ ఆయనే ప్రారంభించాడు.

'ఏదో గీతలో చెప్పినట్లు — మన ధర్మం మనం చూచుకోవాలి. కొడుకులకు, కూతుళ్లకు... చదువులు, ఉద్యోగాలు, పెళ్లిళ్లు చూచుకోవాలి. ఆడపిల్లలయినా, యిదివరలాగ యింకో యింటికి పోయేదేగదా చదువులు,సంగీతాలు ఎందుకుఅనడానికి లేదు. కొడుకు ఎంతో కూతురూ అంతే. అందరి మీదా డబ్బు ఖర్చుపెట్టాలి. ఎవరి దగ్గర్నుంచీ యేమీ ఆశించటానికి లేదు. డబ్బు సంగతి కాదు, ఆత్మీయత — అనురాగం యిలాంటివి కూడా కోరుకోవటానికి లేదు, యీరోజుల్లో — '

— యిలా ఆయన తాత్పర్యం అంతా చెప్పుకుపోతూంటే ... ఒక గంట గడిచిపోయింది.

'ఆరోగ్యం బాగావుండడంలేదు. అందుకని మా డాక్టర్ అబ్బాయి దగ్గరకు వెడుతున్నాను. వాడయితే రెండు నెలలలో మళ్లీ నన్ను మామూలు మనిషిని చేసి పంపిస్తాడు—' అన్నాడు చివరకు.

జోలార్‌పేటలో రైలు ఆగినప్పుడుగాని యీ ప్రవాహంనుంచి యివతలపడలేదు సుందరం. ప్రయాణం సగం అయిపోయింది. మరో మూడు గంటల్లో బెంగుళూరు వచ్చేస్తుంది. యమున 'త్వరగా వచ్చేయండి' అన్నమాట చటుక్కున గుర్తువచ్చింది అతనికి. ఆయనదగ్గర సెలవు తీసుకుని వెనక్కు తిరిగాడు

అతను మళ్లీ వచ్చేసరికి ముగ్గురాడవాళ్లూ బాగా కబుర్లలో పడిపోయివున్నారు. పిల్లలు వాళ్ల ఆటల్లో మునిగిపోయివున్నారు.

'నువ్వు ఎన్నయినా చెప్పు అమ్మాయీ. పిల్లలున్నదారివేరు. ముసలితనంలో వాళ్లు ఆదుకోనీ, ఆదుకోకపోనీ నావాళ్లని చెప్పుకోవటానికి కొందరు వుంటారు. అలా కాకపోతే యేకాకి బతుకు అయిపోతుందమ్మా. జీవితంలో అసలు రుచి తెలిసివచ్చేది, మనవలూ, మనమరాళ్లు, కోడళ్లు, కూతుళ్లూ అందరూ చుట్టూ తిరుగుతూవున్నప్పుడే. వాళ్లు మనను పెట్టి పోషించేది ఎలాగూలేదు అయినా అదో ఆనందం, తృప్తి...' యిలా మాట్లాడుకుంటూపోతోంది ఆమె, కూతుర్నీ యమునను జాయింట్‌గా ఉద్దేశించి.

సుందరం కూర్చున్నతరువాత యీ 'టాపిక్' మారిపోయింది. ఆమె — వాళ్ల సంచులలోనుంచి ఫలహారాలు తీసి అందరికీ పంచియిచ్చింది. మొహమాటపడుతూనే సుందరం కూడా పుచ్చు కున్నాడు. అన్నీ తినేటప్పటికి కంటిమీదకు కునుకు పట్టేసింది. ఆలోచించుకుంటూనే నిద్రలో పడిపోయినాడు.

* * *

ఆటోరిక్షాలో అక్కడకు చేరుకున్నారు యమున, సుందరం. ఆ యిల్లు చేరుకునేసరికి అక్కడ అప్పటికే చాలామంది జనం వున్నారు. ఎవరిని కలుసుకోవాలో, యేమని అడగాలో తెలియక కాస్త కలవరపడ్డాడు సుందరం.

'ఇక్కడున్నవాళ్లలో సుందరంగారు ఎవరు ?' అని అడుగుతూ లోపల గదిలోనుంచి ఒక ఆసామీ హాల్లోకి వచ్చాడు. ఆయన ఆ ప్రశ్న 'కన్నడం'లో వేశారు. 'సుందరం' అన్నమాట తప్ప సుందరానికి యింకేం అర్థం కాలేదు. హాల్లోవున్న తలిమ్మా జనం అంతా ఒకళ్ల ముఖాలు ఒకళ్లు చూచు కున్నారు.

ఆయన మళ్లీ అడిగాడు - 'సుందరం అవరుయారు ?', కన్నడంలోనే గొంతు కాస్త పెంచి.

ఇందాకటి కంటె చిన్న వాక్యం అవడంవల్లనో అప్పటికి మనస్సు కాస్త స్థిమితం చిక్కినట్లు అయినందువల్ల సుందరానికి ఈ ప్రశ్న అర్థం అయింది.

'నేనే నేనే!' అన్నట్లుగా సుందరం తల ఊపడం, ముందుకు అడుగు వేయడం గమనించి ఆయన 'మీరేనా సుందరం' అని అడిగాడు యీమారు యింగ్లీషులో.

'ఎస్. ఎస్.' అన్నాడు సుందరం.

'రండి. గురూజీ పిలుస్తున్నారు.' అని ఆ ఆసామీ వెనక్కు అడుగువేశాడు. సుందరం అనుస

రించాడు. ఆయన మళ్లీ వెనక్కు తలతిప్పి 'అమ్మగారిని కూడా రమ్మనండి' అన్నాడు కన్నడంలో.

అంతవరకు తాను యేం చేయాలో తెలియక తికమక పడుతున్న యమున చురుకుగా అడుగులు ముందుకు వేసింది.

ముగ్గురూ హాలులోనుంచి ఉత్తరంగా నడిచి ఒక గదిగుమ్మం దగ్గరకు చేరుకున్నారు. తలుపులు దగ్గరకు వేసివున్నాయి.

ఒక తలుపు పక్కకు తొలగించి ఆ ఆసామి లోపలకు వెళ్లాడు. తర్వాత 'సుందరాన్ని రమ్మని సైగచేశాడు. మందరంతోపాటు యమున కూడా గదిలో ప్రవేశించింది.

లోపలకు అడుగు వేయడంతోటే గదంతా పరిశీలనగా చూశాడు, మందరం.

చిన్నగది. ఒక మూలకు టేబుల్, దానిమీద కొన్ని పెద్దసైజు ఫొటోలు వున్నాయి.

---

ఈ పటాల ముందు అగరువత్తులు వెలుగుతున్నాయి.

సుకుమారమయిన పరిమళం గదంతా ఆవరించివుంది.

మరో పక్కన కొయ్యమంచం, దానిమీద పలచటి పరుపు.

మంచం మధ్యలో ఒకరు పద్మాసనంలో కూర్చునివున్నారు.

సుందరం ఆయన్ను చూడడంతోటే చేతులు జోడించి నమస్కారం చేశాడు. యమున సాష్టాంగపడి నమస్కరించింది.

'ప్లీజ్ బి సీటెడ్' అన్నారు ఆయన, గురూజీ.

యమున తను తీసుకువచ్చిన పళ్ళు, పూలు ఆయనకు సమర్పించింది. చిరుమందహాసంతో రెండు చేతులూ జాపి అందుకున్నారు.

'కూచోండి' అన్నారు యీమారు కన్నడంలో.

'గురూజీకి యింగ్లీషు సరిగా రాదని చెప్పారు. మాకు కన్నడం బొత్తిగా రాదు. తెలుగు—యింగ్లీషు—మాత్రం' అన్నాడు సుందరం.

గురూజీ ధైర్యం యిస్తూ 'మరేం ఫర్వాలేదు. మీరు యే భాషలో మాట్లాడినా నాకు అర్థం అవుతుంది. నేను మాత్రం ఇంగ్లీషు, కన్నడం, హిందీ కలిపి మీకు అర్థం అయ్యేలా మాట్లాడుతాను. నా దగ్గరకు వచ్చినవాళ్లు అసంతృప్తి పడక్కర్లేదు—' అన్నారు.

'తమ గురించి విన్నాం. విన్నదంతా నిజమేనని మీ దర్శనంతోటే నమ్మకం కుదిరింది' అంది యమున.

గురూజీ నవ్వి వూరుకున్నారు.

తరువాత సుందరాన్ని కులాసా ప్రశ్నలు వేశారు. పొడిపొడిగా సమాధానం చెప్పాడు సుందరం.

'చూడండి. ఈ జీవితం యిప్పుడే ఈ జన్మలోనే ప్రారంభం చేయలేదు మనమెవ్వరమూ. కొన్ని వేల, లక్షల సంవత్సరాల క్రిందట ప్రయాణం ప్రారంభించిన మనుష్యులు కూడా మన మధ్య వున్నారు. కలియుగ ప్రమాణం ఎంత చెప్పండి—' అని అడిగారు ఆయన.

'నాలుగు లక్షల ముప్పై రెండు వేల సంవత్సరాలు ...'

'అవునా ? ఈ జీవుడు అన్ని సంవత్సరాలూ యేదో రూపంలో, యేదో లోకంలో వ్యవహరిస్తూ వుంటాడు. ఒక్కక్షణం అయినా నిదానంగా వుండడు.'

యమున తల ఊపింది.

'మనం చేస్తున్న ప్రతిపనికీ తగిన ప్రతిచర్య వుంటుంది. పని అంటే చేతులతో, కాళ్లతో చేసింది మాత్రమేకాదు. ఆలోచనలు, రాగభావాలు అన్నీ పనులే. మనం చేసిన పనులవల్ల ఉత్పన్నం అయ్యే ఫలితాలను మనమే అనుభవించాలి. దీన్నే కర్మ సిద్ధాంతం అంటారు — మనదేశంలో. పేరు తెలుసును గనుక మనకు 'కర్మ' అంటే అంతా తెలిసినట్లే వుంటుంది. కాని కర్మను గురించి పూర్తిగా అర్థం చేసుకోవాలంటే కర్మకు అతీతులయిన వారికే సాధ్యం — '



# ఎవరికి వారే!

'మంచి జరగకుండా కర్మ అడ్డం పడుతుందా గురూజీ ?' అడిగింది యమున.

'మంచి, చెడ్డ అనేది మనం అనుకోవడంలో వుంది. కర్మ అడ్డం పడదు, ముందుకు తీసుకుపోదు మనకు రావలసిన ఫలితాలను అందించే సాధనం మటుకే అది. తనకు 'మంచి' జరగాలని ప్రతి మనిషికీ వుంటుంది. కాని అలా జరగడానికి తగిన కృషి చేయాలని తోచదు. అందుకనే అలభ్యం అవుతుంది. జీవితం డొంకదారుల్లో వెదుకుతుంది—'

'ఇదంతా అర్థం చేసుకోవడం మాబోటి సామాన్యులకు చాలా కష్టం.'

'ఏమీ కష్టం కాదు. కాస్త ఆలోచిస్తే ఎవరికయినా తోస్తుంది. కాకపోతే మనకు ఆలోచించటానికి తీరుబాటులేదు. అంతే' అన్నారు గురూజీ.

'ఇంతకూ జీవితంలో కావాలనుకున్నవి దొరకవంటారా గురూజీ !' అడిగింది యమున.



'కావాలని తీవ్రంగా కృషి చేసినవి తప్పకుండా దొరుకుతాయి. అయితే ఎప్పుడు దొరుకుతాయో చెప్పలేం.'

'అలా అయితే జీవితం అంతా వెదుకులాటే అయిపోతుంది.'

'నిజమే. వెదుకులాటలో సమయం వృధా చేసుకోకుండా ఎవరికివారు తమ ధర్మం పాలించుకుంటూపోతే... అన్నీ అవే సమయానుకూలంగా సమకూడుతాయి.'

'ఉన్నదానితో తృప్తిపడడం మంచిదంటారు!'

'అట్లా మరీ కుదించివేయగూడదు. తృప్తి అలవరుచుకోవడంవల్ల జీవితం నిండుగా వుంటుంది. చూడండి. జీవితాంలో మనకు యేంకావాలో... నిజంగా తెలియదు. ఒక్క క్షణంలో కావాలనిపిస్తుంది, తీరా అది దొరికిన తర్వాత ఎందుకొచ్చిన మేళంరా బాబూ — అనిపిస్తుంది. అవునా, కాదా?'

'అవును —' మనస్ఫూర్తిగా తల ఊపాడు సుందరం.

'అందుచేత మనం కావాలనుకుని ఆత్రులు చావడం ఎందుకు ? దొరికినదానితోనే సమాధానపడి జీవిత ధర్మంమీద కర్తవ్యం వేసి పనిచేసుకుపోవచ్చునుగా. మనకు నిజంగా రావలసివుంటే అన్నీ అవే సమకూడుతాయి — అన్న ధైర్యం మన జీవితాలను నడిపించవచ్చునుగదా !'

'అవునవును' అన్నాడు సుందరం ఈమారు మరీ గట్టిగా.

'అవును కదా ! కాని — కావాలనుకోవడం మానవ సహజం' అన్నారు గురూజీ.

'అవునండి. కోరికలే లేకపోతే మానవజన్మ ఎందుకు ?' అంది యమున.

'కోరికలు వుండవలసిందే. వాటికోసం శ్రమపడి పనిచేయవలసిందే. కాని ఫలితాలు పరాధీనం. మనం అనుకున్నది కాకపోతే జీవితం వృధా అనుకోగూడదు — '

యమున ఆసక్తిగా ముందుకు జరిగింది.

'మీ మనసులో కోరిక యేమిటో నాకు తెలుసు — మనస్ఫూర్తిగా ఆశీర్వదించి మంత్రాక్షతలు యిస్తున్నాను. నేను చెప్పిన నియమాలన్నీ జాగ్రత్తగా గమనించి అమలుచేయండి—'

క్షణంపాటు మౌనం ఆవరించింది గదిని.

ఆ మౌనంలోని ప్రశాంతత, పరిపూర్ణత సుందరాన్ని పూర్తిగా ఆకట్టుకున్నాయి. గురూజీ వంక తృప్తిగా చూశాడు.

ఆయన అరకళ్లతో ధ్యానముద్రలో వున్నారు. తమకు యివ్వబోయే మంత్రాక్షతలు కుడిచేతి గుప్పిట్లో పట్టుకుని హృదయం దగ్గరకు చేర్చుకున్నారు. తరువాత నుదుటి దగ్గరకు గుప్పిడి తీసుకువెళ్లి ఒక్కక్షణం వుంచి కళ్లు తెరిచారు.

మంత్రాక్షతలు కాగితంలో పొట్లం కట్టి యిద్దరికీ అందించారు.

'శుభం. వెళ్లిరండి' అన్నారు సెలవు ఇస్తూ.

యమున, సుందరం యిద్దరూ సాష్టాంగ నమస్కారం చేశారు.

'మూడురోజులు యీ మకాంలో వుంటాను. మీకు వీలయినప్పుడు వచ్చి కలుసుకోవచ్చును — '

సుందరం 'అలాగే చేస్తాం. సాయంత్రం మళ్లీ వచ్చి దర్శనం చేసుకుంటాం —' అన్నాడు.

గురూజీ పెదవులు కదిలీ కదలకుండా చిరుమందహాసం చేశారు. వరద హస్తం చూపుతూ మళ్లీ ఆశీర్వదించారు యిద్దరినీ.

సుందరానికి ఆ గది వదలిరావడం కష్టం అయింది.

బయటకు వచ్చి రోడ్డుమీద రిక్షా కోసం నిలుచున్నప్పుడు 'ఎలా వుంది ?' అని అడిగాడు యమునను.

'చాలా సంతోషంగా వుంది.'

'కోరిక ఫలిస్తుందనా ?'

'కోరిక అర్థం అయింది నాకు. ఇప్పుడు ఫలించడం - ఫలించకపోవడం రెండూ వేరు వేరు కావు. ఆ సమక్షంలో కూర్చోగలగడానికి మనం ఎంతో పుణ్యం చేసివుండాలి—' అంది యమున దాదాపు తన్మయతతో.



# అవగాహన

(18వ పేజీ తరువాయి)

వుద్యోగి అన్న దయ అన్నా లేకుండా ఆకాశాన్నంటే అద్దె అడిగింది.

'మధ్యతరగతి బూర్జువాల పట్ల దయ ఏమిటండీ ? సోషలిస్టు అవగాహన వున్న వాడు ఎవడూ ఆ పని చేయడు. కార్మిక పక్షపాతం చూపాలి.'

'పోని కార్మికులకే అద్దెకిస్తే బాగుండేదిగా ?' అలా అనాలనిపించినా రాయ్ అనలేదు. ఆమె అప్పుడనబోయే మాటేమిటో అతనికి తెల్సు.

'మీకు చారిత్రక అవగాహన బొత్తిగా లేదండీ.'

ఆ బ్రహ్మాస్త్రానికి తిరుగులేదు మరి !

* * *

పక్కవాటాలో చేరిన నూతన జంట మాట్లాడుకొనే మాటలు మలయమారుతిని చెవిని పడుతూనే వున్నాయి. మొదట్లో 'బూర్జువా సెంటిమెంట్లు, బూర్జువా సర్దాలు' అనుకొని చిరాకు పడింది. అయితే వినగా వినగా వాళ్ల మాటల్లో గల అనురాగం, ఆత్మీయత ఆమె గుండెల్ని తాకసాగాయి. ఏదో లోటు ఫీలవసాగింది మలయమారుతిని !

'యివాళ డ్యాన్సు ప్రోగ్రాం వుందిటండీ. నాకు వెళ్లాలని వుంది. మీకూ అంగీకారమయితే రెండు టిక్కెట్లు కొనుక్కొస్తాను. ఏమంటారు ?' వారోజా రాయ్ అన్నాడు.

భర్త కొత్తలో అలా ప్రతిదానికీ అడుగుతుంటే, మర్యాదనిచ్చి మన్నన చేస్తుంటే ఏదో గర్వం ! థ్రిల్ !

కానీ యివాళ ఆ అనుభూతి కలగటం లేదేం ? అతని మంచితనం, మర్యాద మొహంమొత్తుతున్నదేం ?

'ప్రతిదానికీ నా అనుమతి కావాలా ? మీరు టిక్కెట్లు కొనుక్కొచ్చి డ్యాన్సుకు రమ్మంటే రానా నేను ?' మొగుడిమీదికి ధ్వజమెత్తింది.

'అలాగనికాదు. నా అభిరుచిని మీ నెత్తిన రుద్దటం నిరంకుశత్వం కాదూ ? మీ వ్యక్తిత్వానికి విలువనివ్వడం నా ధర్మం కదాండి ? ఏమంటారు ?'

మలయమారుతిని కొత్తజంట సంభాషణల్లో ఆత్మీయత గుర్తుకొచ్చింది. ఏడి

# ఛాంపియన్ డిటర్జంట్ కేక్ !

# 1అప్

మరింత
తెల్లదనంతో
మీకు
విజయం!



అధిక తీవ్రంగా పని చేసే నురుగ, అధికంగా తెలుపుచేసే పదార్థాలతో శక్తి, దాంతోపాటే శుభ్రతతో పాటు తెల్లదనాన్ని యిస్తుంది మీకు వన్-అప్! దాంతో తెల్ల వాటికి మరింత తెలుపు, రంగువాటికి మరింత మెరుపూ వస్తుంది.







మీకు
డబ్బులో
మరింత
ఆదా!



వన్-అప్, మరే యితర డిటర్జంట్ కేక్ కన్నా ఎక్కువకాలం మన్నుతుంది. ఎందుకంటే, వాడగానే తొందరగా అరిగిపోదు గనక. అంటే ఉతికే ప్రతిసారీ మీరు డబ్బును ఆదా చేస్తున్నారన్నమాటే!

తెల్లదనానికి మీ పాలిట ఛాంపియన్!

ASP/WL-IUP 28

విట్‌కో లిమిటెడ్, కాలోల్ 389 330 గుజరాత్.

తాజా వార్తలకు ఆంధ్రపత్రిక దినపత్రిక చదవండి !

సంఘంలో అతి చులకనగా చూడబడి, కష్టనష్టాల మెట్లెక్కి స్వర్గతుల్యమైన జీవితాన్ని పొంది ప్రేమించిన ప్రియుడిచే దేవతగా నీరాజనాలు పొందిన అపూర్వ సాహసి మేనక పాత్ర-చిత్రీకరణే!—

## శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి

తమ అభిమాన పాఠకులకి సమర్పించిన నూతన నవల

# నీరాజనం

వెల:రూ.15/-

అన్నిషాపుల్లోనూ దొరుకుతుంది. లేదా ఒకరూపాయి తగ్గించి M.O. చేయండి. ఆరూపాయికి V.P. పంపుతాము.

**క్వాలిటీ పబ్లిషర్స్** రామమందిరం వీధి, విజయవాడ - 520002

# "అందం చిందే నాజుట్టుకు అందమైన కారణం-టియారా"




ఏ రకమైన జుట్టుకైనా
సరిపడే టియారా షాంపూ:

- టియారా ఎగ్ షాంపూ
- టియారా బ్యూటీ షాంపూ
- టియారా షీకాకాయ్ షాంపూ
- టియారా లెమన్ షాంపూ
- టియారా లెనోలిన్ షాంపూ
- టియారా హెయిర్ కండిషనర్

కూడా దొరుకుతుంది




**టియారా షాంపూ**




కేశసంరక్షణ విషయాలలో ప్రపంచనాయకులు

everest/80/JKH/314-టి.

ఎవరెలా ని వత్తు కొంటూయివాళ్ళ. వింత ఆప్యాయత!

ఆమెకు ఉక్రోషం వచ్చింది. అందులో నుంచి బాధ-ఏడుపు!

'ముందు యికనుంచి యిలా 'అండీ'లు గుండీలు మానేయండి. ఏం? పెద్ద-మగవారు! భార్యను 'అండీ' అని 'మీరు మీరని' పిలవటానికి సిగ్గేయటం లేదూ?'

'అదేమిటండీ? కొత్తగా మాట్లాడుతున్నారే యివాళ?'

'పక్కవాటాలో శారదను ఆమె భర్త ఎలా పిలుస్తాడో విన్నారా? ఏం? నాకా ఆప్యాయత, అనురాగం అక్కర్లేదనుకొన్నారా? యికనుంచి పరాయిదాన్ని పిల్చినట్లు పిలిస్తే వూరుకోను. తెల్సిందా?' శాసనం అది.

'అలాగే పిలుస్తాను. కానీ అప్పుడు మీరు నన్ను కూడా 'ఒరేయ్ — ఏమిట్రా' అని పిలవాల్సి వుంటుంది. పెళ్ళికి ముందు మీకిచ్చిన మాటను మర్చిపోలేదండీ నేను. మాటతప్పే మనిషిని కాను నేను.'

* * *

భర్తచేత 'అండీ' మాన్పించటానికి మలయవాసిని ఎన్నో ప్రయత్నాలు చేసింది. కోపాలు — అలకలు — పోట్లాటలు — విషాదాలు — ఆమె ఎన్నిచేసినా అతను తన పద్ధతి మార్చలేదు. తన శాంతంతో, మంచి తనంతో ఆమెను జయిస్తూనే వచ్చాడు.

'ఛీ ఆడదానితో— అందులోనూ తాళి కట్టిన భార్యతో పోట్లాడడంకూడా చాత కాని వాడిని పెళ్ళి చేసుకోటం నాదే పొరపాటు.'

'పెళ్ళాంతో పోట్లాడటం ఏం గొప్పండీ? యింకా శ్రామిక పక్షపాతంతో వారి హక్కులకోసం బూర్జువా వర్గాలవారితో పోరాడినా ఫలంగానీ.'

'ఆ— ! ఉట్టికెక్కలేనమ్మ స్వర్గాని కెక్కుతుందా అని— భార్యా పక్షపాతం లేదు—ఆడదానితో పోట్లాడలేరు. యిక మీరేం విప్లవాలు నడిపిస్తారు?'

భర్త గౌరవించే కొద్దీ మలయవాసినికి కంపరం పెరిగింది. అతను లొంగిపోయే కొద్దీ ఆమెకు, అతను తిరగబడి తనని తన్నాలన్న కోరిక పెరిగిపోయింది. మానసికంగా మార్పు రాసాగింది.

# అవగాహన

ప్రయత్నించి నాగ్గాటని తగ్గించుకొంది. ఎంగిలి ముక్కల వాడకాన్ని విసర్జించింది. కొత్తగా ఆలోచించింది. కొత్త పాఠాలు నేర్చుకొంది!

'ఏమండీ. నాదో చిన్న అభ్యర్థన' రాత్రి వేళ, రాగోదయ సమయాన, భర్త చెంత చేరి లాలనగా అంది మలయవాసిని.

'అభ్యర్థన ఏమిటి? హక్కు. చెప్పండి' అంటాడని ఆమెకు తెల్సు. అంచేత అతనికా అవకాశం యివ్వలేదు!

కొత్త భార్య సాక్షాత్కార మయివుతుంది రాయ్‌కి!

'సంప్రదాయ జీవన సరళిలో మనిషి యొక్క శారీరక మానసిక ధర్మాలు ఇమిడి వున్నాయని అవగాహన చేసుకొన్నానండీ. మీ మంచితనంతో నన్నింకా చిత్రవధ చేయకండి. పెళ్ళికి ముందు ఇంటర్వ్యూ. నేను పెట్టిన కండిషన్లు మర్చిపోండి. ప్లీజ్. మీ భార్యగా నాకు సంపూర్ణ అనురాగాన్ని, ఆత్మీయతని ప్రసాదించండి—'

మలయమారుతీయంత చల్లగా వున్నాయి ఆమె మాటలు. భార్యను దగ్గరికి తీసుకొన్నాడు రాయ్.

'స్వభావసిద్ధంగా నువ్వు మంచిదానివి మలయం. అయితే నీ ఆలోచన కొద్దిగా వక్రించింది. ఎక్కడో చెప్పుకో చూద్దాం.'

'శాస్త్రీయ అవగాహన పేరిట మనిషి మనో ధర్మాన్ని విస్మరించటమా? హక్కులు పేరిట స్పర్థను చేజేతులా సృష్టించుకోటమా?'

'అజ్ఞానం బలిసిన రోజుల్లో పూర్వం, భారతీయ ధర్మశాస్త్రాలలోని కొన్ని ముక్కలు మాత్రమే నేర్చుకొని, తాము సకలశాస్త్రవేత్తలమైనట్లు మనుష్యుల్లో మూఢత్వాన్ని నూరిపోసేరు కొందరు. యిప్పుడు— విదేశీయమైన ఏ సిద్ధాంతంలోని కొన్ని ఎంగిలి ముక్కల్ని ఏరుకొని శాస్త్రీయ దృక్పథం అంటూ కొత్త మూఢత్వాన్ని ఇంజక్షన్ వేయటానికి ప్రయత్నిస్తున్నారు మరికొందరు. మీ నాన్న నుంచి నేర్చుకొన్న అలాంటి ఎంగిలి ముక్కలే నీ బుద్ధి వక్రం కావటానికి కారణం. ఏ సిద్ధాంతమైనా ఆ దేశ మౌలిక సంప్రదాయాలకూ విశ్వాసాలకూ అనుగుణంగా వుండాలి. అలా కాకపోతే స్పర్థ తప్ప జీవితంలో సంయమనం సమకూరదు. శాంతి, ప్రగతి వుండదు.'

'ఏమీ తెలియని అమాయకుల్లా నటించారన్నమాట! అబ్బో— మీకు చాలా తెల్సే?'

'ఏమీ తెలియకుండా నిన్ను పెళ్ళి చేసుకొనే సాహసాన్ని చేస్తానా?'

''అయినా నా మొండి ధోరణిని యిన్నాళ్ళు ఎలా సహించారండీ?'

'ప్రేమతో, సహనంతో జయించలేనిదేముంది మలయం? ప్రేమించి చేసుకొన్న భార్యను సంస్కరించుకోలేనివాడు, సంఘాన్ని దేశాన్ని ఏం సంస్కరించ గలుగుతాడు?'

'నేను చాలా అదృష్టవంతురాలినండీ.' మలయానిలంలా మెల్లగా చల్లగా అందామె!



# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

**వి. ఆర్. కె. ఆర్. — పాలమూరు**

సమస్యలకు పేద, గొప్ప అని తారతమ్యం ఉండదు ఎందుచేతనంటారు ?

అవి సమస్యలు కావటంచేతనే. ఎటొచ్చీ చిన్న తేడా ఉంటుంది. చిన్నసమస్యలుకూడా పెద్ద సమస్యలే పేదలకి! పెద్ద సమస్యలుకూడా చిన్న సమస్యలని పిస్తాయి గొప్పవాళ్ళకి.

**వి. — పాలకొంచ**

ఎవరేనా వింటే నవ్వుతారేమోనన్న భయంతో ఆడవాళ్ళు గట్టిగా మాట్లాడరన్నారు. గాని ఎవ రైనా వింటున్నారా లేదా అని మరీగట్టిగా మాట్లాడేవాళ్ళు యిప్పుడుఎక్కువ. ఏమంటారు. అందుకే గుడ్డిగా ఏ విషయంపై నిర్ణయాలు చేయవద్దని సలహా !

అహాన్నద్భాగ్యా! వినవలసినవి వింటున్నారా లేదా అని గట్టిగా మాట్లాడుతారు ఆడవాళ్ళు !!సరేనా?

ధను — బసంత్ నగర్

నేను అందంగా ఉంటానంటారు చూసేవాళ్ళు. కాని నాకువచ్చే ప్రతి సంబంధం తిరిగివెళ్ళిపోతూంది.

దానికి మీ అందం ఉండడంలేకపోవడం కారణం అయి ఉండదమ్మా అలా అనుకోకు. అందం అంటే తెల్లగా మద్ద బొమ్మలాగా ఉండడంకాదు. తెల్లగా ఉన్నా నల్లగా ఉన్నా కన్నూ, ముక్కూ తీరుగాఉంటే చాలు. జీవకళ ఉట్టిపడుతూంటే చాలు. అందం పర్సనాలిటీగాని రంగు కాదు.

డి. వి. ఆర్. — పులివెందుల

ఆడవారి జీవితం అరిటాకు వంటిదంటారే— మరి మగవారి జీవితం ?

వడ్డించిన విస్తరి. (ఏదో కష్టపడి చదివేసి ఉద్యోగం సంపాదించినా సంపాదించకపోయినా ఫరవా లేని జీవితం. ఇంకా ఫైనల్ యియర్‌లో ఉండగానే సీటులో గదెని పెట్టి బేరం మొదలుపెట్టినట్ను కట్నాల వారీగా కన్నెలవేట ప్రారంభిస్తారు పెద్దలు. వీట్నల్లో రకరకాలు. ఉద్యోగం యిప్పించడం దగ్గిర నుంచి ఇల్లు పట్టించడం దాకా చూసుకుంటారా? లేదా ఎంతిస్తారు? తేల్చుకోవచ్చు. ఈ మధ్య కొత్త రకం వార్త విన్నాను. కాకినాడ నుండి చక్కని ఉద్యోగం చేస్తున్న పిల్లని పదిహేనో ఇర వయ్యో పుచ్చుకుని పెళ్ళాడి బొంబాయి చక్కా పోయి, పత్తాలేట్ట పెళ్లికొడుకు. అబ్బాయి మీద బాధ్యతపెట్టి చేతులు కడుక్కొన్నారట తల్లితండ్రులు. ఇక పెద్దలు నిలదీస్తే ఆ అమ్మాయికి మారీడ్ స్టేటస్ యిచ్చాను. అదే పదివేలు అనుకోమన్నాట్ట ఆ ప్రబుద్ధుడు! అందుకే వడ్డించిన విస్తరి అన్నాను.

జె. జె. ఎస్ — బళ్లారి

నేనొక చెల్లితో స్నేహం చేశాను. ఒకరినొకరు చూడకపోయినా, ఉత్తరాల ద్వారా ఆప్యాయతనీ, అనురాగాన్ని పంచుకున్నాము. మాది జీవితంలో మరిచిపోలేని స్నేహంగా మారింది. ఎన్నో ఉత్తరాలు రాశాను. తిరిగి ఆమె నుండి ఒక్క ఉత్తరమైనా రాలేదు. స్నేహంలో తీయదనం ఉందంటారా? లేక మీ ఆడవాళ్ల మనస్తత్వమే అంతా?

నీ సోదర ప్రేమకి బెదిరిపోయి ఉంటుంది! అయినా యీ అన్నా చెల్లెళ్ల ఆప్యాయతలూ అను బంధాలూ సినిమాల్లోలాగా జీవితంలో ఉండడం ఎక్కడైనా చూశారా ?!




డి. డి. పి. — డిబ్రుగర్

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. ఆమె నన్ను ప్రేమించింది. మమ్మల్ని చూసిన వారందరూ ఆదర్శ ప్రేమికులు అనేవారు. కాని కొన్ని కారణాల వల్ల ఆమె వేరొకరిని పెళ్లి చేసుకుంది. నేనామెని మరువలేకపోతున్నాను. ఎలా ?

మీది పిసరైన 'ఆదర్శ' ప్రేమ. అందుకే— లైలా మజ్నూలలాగా, పార్వతీ దేవదాసుల్లాగా విడి పోయారు.చరిత్రలో చిరస్థాయిగా అలాగే దుఃఖిస్తూ నిలిచిపోలేరా?! పవిత్ర ప్రేమకోసం త్యాగం చేయ లేరా మీ సుఖాన్ని !!

ఎమ్.సి. — హైద్రాబాదు

ఒక నిష్కళంకమైన ఏకపత్నీ వ్రతుడు తన పిల్లలలో ఒక పిల్ల తనకు పుట్టినది కాదని తెలుసు కున్నప్పుడు అతని కర్తవ్యమేమిటి?

ఏం లేదు. పైలెట్ ప్రేమ్‌నాథ్‌లో శివాజీ లాగ హూ యీజది బ్లాక్ షీప్? అంటూ అరుస్తూ పాడడమే. (లేకపోతే సాదాసీదా మగవాడు చేయ కల్గినదొకటుంది-పిల్లల్నీ పెళ్ళాన్నీ ఒదిలేసిపోడమే!!)

కె. వి. ఆర్. — విజయవాడ

ఆశావాదిగా వుండడం మంచిదా? నిరాశావాదిగా ఉండడం మంచిదా?

ఆ రెండిటి కంటే కూడా వాస్తవిక వాదిగా ఉండడం మెరుగేమో !

**ఎస్. ఎస్. బై పల్లి**

సన్నాయి అప్పన్నలో నటించిన జి.వి.జి. ఆంధ్ర సచిత్ర వారపత్రిక సినిమా విశేషాలు రాసే జి.వి.జి. ఒకరేనా? పూర్తి పేరేమిటి?

ఒకరే. జి. వి. గోపాలకృష్ణ.

ఎమ్. హెచ్. — కడప

ఆడవారి కాళ్ళకు మట్టెలు, మెళ్ళో మంగళ సూత్రాలు చూసి వివాహం అయిందని సులభముగా కనుక్కోవచ్చును. కాని మగవారికి వివాహం అయి నదీ, లేనిదీ తెలుసుకోడం ఎలా?

వెరీ సింపుల్!నిర్భీతిగా,నిర్లజ్జగా,నిస్సంకోచంగా అందరాడాళ్లకేసీ కన్నార్పక చూసే వాళ్లకి పెళ్లి అయిఉంటుందని నిర్ణయించుకుంటారు ఆడవాళ్ళు.

పి. ఎస్. ఆర్. — తిన్సుకియా

ఆడదానికి అహం ఉండడం మంచిది కాదు. మగవాడిని ఎదిరించి ఏ ఆడదీ చరిత్రలో నిలిచిన సాక్ష్యం ఎక్కడా లేదు.

ఎప్పటి చరిత్రో ఎందుకు? మీకు వర్త మానంతో పని లేదా? ఇందిరాగాంధీ సాధించిన దేమిటని మీ ఉద్దేశ్యం? అహం దానికి జతగా తెలివి, వీటికి తోడుగా ఆర్థిక స్తోమత ఉంటే—మీ చరిత్రలు తిరగేస్తారు స్త్రీలు !

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి తిప్పి పంపబడవు. -సం.

# వంటలు

## కొబ్బరి ఇడ్లీ

కావలసినవి : అర్ధసేరు బియ్యం, ఒక కొబ్బరికాయ, చిటికెడు సోడా, పుల్లమజ్జిగ, పచ్చిమిర్చి, అల్లం, పోపు సామాను.

చేయువిధానం : రేపు ఇడ్లీ చేస్తామనగా బియ్యం నానపోసి పిండి కొట్టాలి. దీని నుండి పావుసేరు సన్నని నూకను తీసుకోవాలి. ఈ నూకలో తగినంత నీరు పోసి, ఉడక నివ్వాలి. ఈ ముదలో ఉప్పు, పుల్లమజ్జిగ, బియ్యపిండి, సోడా వేసి గట్టిగా కలపాలి. మర్నాడు కొబ్బరి కోరి నానబెట్టిన పిండిలో వెయ్యాలి. పొయ్యిమీద బాణలి మూకుడు పెట్టి కాస్త నెయ్యివేసి మినపప్పు, ఆవాలు, జీలకర్ర, తగినన్ని పచ్చిమిర్చి, అల్లం ముక్కలు, పోపు పెట్టి ఈ పిండిలో వెయ్యాలి. పిండి గట్టిగా ఉంటే గరిట జారుగా ఇడ్లీపిండి మాదిరి చేసుకోవాలి. దీనిని ఇడ్లీలుగా వండాలి. దీనిలోకి చట్నీ కూడ అవసరంలేదు.

—సీతా త్యాగరాజ్

## బొంబాయిరవ్వతో చేగోడీలు

కావలసిన వస్తువులు :— బొంబాయి రవ్వ – అర్ధకిలో, బియ్యం పిండి – ఒక పావు, తగినంత కారం, ఉప్పు, జీలకర్ర – చెంచా, పెసరపప్పు – అరకప్పు, ఇష్టమున్నవారు కొద్దిగా నువ్వులపప్పు, ఇంగువకూడా వేసుకోవచ్చును. వేయించడానికి నూనె తగినంత. చివరికిష్టమైనవి నూనె, లేదా డాల్డా వాడుకోవచ్చును.

తయారుచేయు విధానం :— ముందుగా గిన్నెలో ఒక గ్లాసుడు నీళ్ళు మరిగించాలి. కొంచెం పెసరపప్పు వేసి కొద్దిగా వుడికాక మరుగుతున్న నీళ్ళలో ఉప్పూ, కారం, జీలకర్ర, నువ్వులపప్పూ వేయాలి. ఆ తరువాత బొంబాయి రవ్వ, బియ్యంపిండి కొద్దికొద్దిగా పోస్తూ బాగా కలియబెట్టాలి. చేగోడీలుచేసి నూనెలో తిరగా వేయించాలి. ఇవిబాగా గుల్లబారి చాలా రుచిగా వుంటాయి. చెయ్యడం కూడా సులభం.

—వడ్లాది. వరహాలమ్మ

# కొత్తచీర

## డి.యస్.ఎన్. శాస్త్రి




రావ్ టెలిగ్రాం విప్పాడు. 'మదర్ సీరియస్ స్టార్ట్ ఇమ్మీడియేట్లీ' అని ఉంది. అమ్మ, అమ్మ, రావ్ గొణుక్కున్నాడు. అతని పెదాలు తడి ఆరిపోయాయి. గబగబా బట్టలు సర్దుకుని రూమ్‌కి తాళం వేసి స్టేషనకి బయలు దేరాడు. రైలులో ఎలా ఎక్కాడో తెలీదు. రైలు ముందుకు వెళుతుంటే అతని మనస్సు వెనక్కి పరిగెడుతోంది ......

అప్పుడు తనకి ఆరేళ్ళు. తండ్రి అల్సర్‌తో బాధపడేవాడు అన్నమాట. చూడని డాక్టరు లేడు. దర్శించని గుడి లేదు. నెలల తరబడి ఆఫీసు మానేయడం వల్ల తండ్రి జీతం పూర్తిగా వచ్చేది కాదు. అమ్మ మెషిను ముందరేసుకొని బట్టలు కుట్టేది. ఆ కూలి డబ్బులతోటే ఇల్లు నడిచేది. అమ్మ ఏదన్నా వండేది. తనూ, చెల్లీ మజ్జిగ మెతుకులు తినేవారు. చెల్లి తనకన్నా రెండేళ్ళు చిన్నది. ఒకమూల పేదరికం నిలువునా తినేస్తున్నా అమ్మ ధైర్యం మట్టుకు పోగొట్టుకోలేదు. అప్పుడు కాకినాడలో ఉండేవారు. రోజూ పొద్దున్నే స్నానం చేసి రూపాయంత కుంకుమ బొట్టు పెట్టుకుని, ఇంట్లోని పారిజాతాల మందారాలతో దీపం వెలిగించి దేముణ్ణి మనసారా పూజించేది. తరువాత తండ్రికి సేవ చేసేది.

తనని, చెల్లిని దగ్గర పెట్టుకుని రామాయణ భాగవతాలలోని పద్యాలు చెప్పేది. గజేంద్ర మోక్షం, ప్రహ్లాద చరిత్ర ఇంకా అవన్నీ తనకి గుర్తే. ఒక రోజు ఇంట్లో గుప్పెడు బియ్యం కూడా లేవు. అమ్మ గుడ్ల నీరు కుక్కుకుంది. చెల్లి ఆకలి అని ఒకటే ఏడుపు. తండ్రి మూలుగుతూ పడుకున్నాడు. ఇంటాయన ఇంటద్దె గురించి మరీ మరీ చెప్పి వెళ్ళాడు. మధ్యాహ్నం మూడయింది. వేసంకాలం. అప్పుడు నాన్నగారి ఆఫీసులోని జవాను దూరపు చుట్టాల పెళ్ళి ఇంట్లోంచి కేరేజి తెచ్చాడు. ఆ రోజు ఆత్రంగా, ఆబగా తనూ చెల్లీ కేరేజిలోవి తిన్నారు. తనకింకా గుర్తే. భగవాన్! ఎటువంటి రోజులవి.

తండ్రి అనే వాడు—పార్వతీ నేనింక బతకను. నీకూ, పిల్లలకి అన్యాయం చేసి వెళ్ళిపోతానని. 'అలా అనకండి, మీకేమీ కాలేదు.'

ని అమ్మ ధైర్యం చెప్పేది. ఆ రోజుల్లోనే ధి మొగని ఒకసారి 'లంకా దహనం' తోలు బొమ్మలాట వేసారు. అమ్మనడిగి తను వెళ్ళాడు. అందులోని రావణుడు, ఆంజనేయుడు, విభీషణుడు అందరూ తన్ని ఆకర్షించారు. అమ్మ చెప్పిన పద్యాలు అవీ గుర్తుకు వచ్చాయి. రాత్రంతా మేలుకుని చూశాడు.

చెల్లికీ, తనకీ ఒకే జత బట్టలుండేవి. అమ్మకు కూడా రెండే రెండు చీరలు. అవే ఉతికి కట్టుకునే వాళ్ళు. ఎందరెందరికో న్గికాల బట్టలు కుట్టేది అమ్మ. కాని కట్టుకుందుకి మనకు ఉండేవి కావు. అలా కుడుతూ కుడుతూ మెషిను మీద నిద్ర పోయేది ఒక్కొక్క రాత్రి. కళ్ళల్లో కళ్ళు పెట్టుకుని చేసేది పని. దీపావళికి అందరిళ్ళలో సంబరంగా, సంతోషంగా ఉంటే తనూ చెల్లి కేవలం మిగతా వాళ్ళ సంతోషాన్ని దూరం నుంచి చూశారు. పేదరికపు ఛాయలు చిన్న గుండెల మీద కసిగా గీశాడు భగవంతుడు. ఒక రోజు తండ్రి రక్తం కక్కుని స్పృహ తప్పిపోయాడు. అమ్మ తనని, చెల్లినీ ఒంటరిగా ఆ స్థితిలో ఉన్న తండ్రికి రక్షణగా వదిలి పెదనాన్నగార్ని పిలుచుకు రావడానికి తను ఒంటరిగా ఆ స్థితిలో తుని వెళ్ళింది.

తరువాత తండ్రిని వైజాగు హాస్పిటలుకి ఆపరేషనుకి తీసుకుపోతూ 'పార్వతీ! వెళ్ళిపోతున్నాను. మళ్ళీ వస్తానో రానో' అన్నాడు తండ్రి. ఆ మాటలు తన చెవుల్లో ఇంకా వినపడుతున్నాయి. 'అలా అనకండి. మీరు తప్పక వస్తారు. పైన భగవంతుడున్నాడు' అంది. తండ్రి వెళ్ళిపోయాక అమ్మ తన దీక్ష మరింత ఉధృతం చేసింది. రోజూ మడి స్నానం చేసేది. దేముడికి దీపం వెలిగించి ఆ దేముడి దగ్గరే గడిపేది. అదో లోకంలో ఉండేది. తను అలా చూసేవాడు అమ్మని. పది రోజులు పచ్చి మంచినీళ్ళు తప్ప మరేమీ ముట్టలేదు. వైజాగు నుంచి టెలిగ్రాం వచ్చింది. అమ్మ పూజలు ఫలించాయి. తండ్రికి సవ్యంగా ఆపరేషను జరిగింది. అప్పుడు కతికింది అమ్మ.

తరువాత తండ్రి నూతనోత్సాహంతో, బాగుపడిన శరీరంతో వేరొక చోట పనిలోకి ప్రవేశించాడు. ఆపరేషనుకు చేసిన అప్పులు అవీ, పేదరికపు ఛాయలు పూర్తిగా వదల లేదు.

ఒకసారి తను చదువుకునే రోజుల్లో టైఫాయిడ్ జ్వరం వచ్చింది. నలభై రోజులకి కాని తగ్గలేదు. పూర్తిగా శుష్కించి పోయాడు. అప్పుడు అమ్మ తన మంచాన్ని అట్టే పెట్టుకుని ఆరారా, కాఫీ, మందులు, పళ్ళూ అందిచ్చేది. 'నాయనా!





## కొత్త చీర

నా తండ్రీ, ఏంత తీసేశావురా' అనేది. తనకే జ్వరం వచ్చినంతగా బాధపడేది.

తండ్రి తరువాత అస్తమానూ అనేవాడు, 'మీ అమ్మ చలవ వల్లే బతికాను నాయనా' అని. అమ్మ తిరిగి అనేది 'ఏదో భగవంతుడు దయ వల్ల మీరు బతికారు. కాని నేను మీ చేతుల మీదుగా పునిస్త్రీగా వెళ్ళిపోతే చాలు' అనేది.

మొన్న మొన్న చెల్లి పెళ్ళి కని తండ్రి చేకూర్చిన ఐదువేలూ దొంగలు దోచుకు పోయారు. డబ్బుతో పాటు ఇంట్లో ఉన్న కాస్త బంగారం కూడా పట్టుకుపోయారు. తను కంటికి మింటికీ ధారగా ఏడ్చాడు. కాని అమ్మ ధైర్యం కోల్పోలేదు. మూలపడేసిన కుట్టుమిషను బయటకు తీసింది. రాత్రి పగలు నిద్రాహారాలు మాని కుట్టడం మొదలు పెట్టింది.

ఈలోగా తనకి చిన్న ఉద్యోగం వచ్చింది. ఇంకా జాయినయి రెండు మూడు నెలలయింది. అమ్మకోసం ఒక మంచి చీర కొన్నాడు. ఇంకాఅమ్మని తనదగ్గరకే తీసుకు వద్దామనుకుంటున్నాడు. ....

స్టేషను వచ్చింది. రావ్ యాంత్రికంగా దిగాడు. అలవాటైన దారిలో వడిగా నడిచి వెళ్ళాడు. వీధంతానిశ్శబ్దంగా ఉంది. గుండెలు వేగంగ కొట్టుకుంటున్నాయి. ఇంటివిన మిపించదు. ఇంటి ముందు జనం మూగివున్నారు. పరిస్థితి అర్థమయింది. అమ్మ నిశ్చలంగా పడుకునుంది. నుదుట కుంకుమ బొట్టు. 'నాయనా! అమ్మ వెళ్ళిపోయిందిరా! ఈ వయసులో నన్నొదిలి వెళ్ళిపోయిందిరా!' తండ్రి గొల్లుమన్నాడు. పోయిన డబ్బు కోసం ఆ వయసులో తను వెళ్ళాక మరింతగా శ్రమించిందని తండ్రిఏమేమో చెప్తున్నాడు. తనకి వినపడటం లేదు. ఆత్మాభిమానం గల అమ్మ, అందరికి ధైర్యం చెప్పి గడ్డు రోజుల్ని దాటించి సంసారాన్ని ఓ కొలిక్కి తెచ్చి వెళ్ళిపోయింది. జీవితకాలంలో సుఖ పడ లేదు. ఇంటి కోసం ప్రాణాల్ని ధార పోసింది. అమ్మ మాటే నెగ్గింది.

రావ్ కళ్ళు అశ్రువులు వర్షిస్తున్నాయి.! ... అమ్మా, అమ్మా, జన్మ జన్మలకి నువ్వే కన్నతల్లివి. హృదయం ఘోషిస్తోంది. మెల్లిగాలేచి తను తెచ్చిన చీర కప్పాడు.

## 40 లక్షలు స్వాధీనం :

బేగంపేట ప్రాంతంలో నివసిస్తున్న ఒక కంట్రాక్టరు ఇంటిపై ఆదాయపు పన్ను శాఖ వారు ఆగస్టు 3 న దాడి చేయగా 40 లక్షల రూపాయల కరెన్సీ నోట్లు, కొన్ని ముఖ్య పత్రాలు పట్టుబడ్డాయి. ఈ కంట్రాక్టరు పూర్వం పోలీసు శాఖలో పని చేసేవాడని, ముఖ్యమంత్రి వర్గీయుడైన ఒక మంత్రికి సన్నిహితుడని తెలియవచ్చింది. ఈ నల్లడబ్బు కంట్రాక్టరు ఇంటి నేలమాళిగలో దొరికిందట. ఆదాయపు పన్ను అధికారులు దాదాపు 18 గంటల పాటు ఈ సోదా చేశారట. ఈ 40 లక్షలలో ఎందరు నాయకుల సొమ్ము ఉందో పాపం.

## విద్యార్థినుల నిరసన :

మహిళలపై నానాటికీ పెరిగి పోతున్న దౌర్జన్యాలకు నిరసనగా ఆగస్టు 5 వ తేదీన జంటనగరాల కళాశాలలు, పాఠశాలల విద్యార్థినులు నిరసన ప్రదర్శనం జరిపారు. అఖిల భారత విద్యార్థి సమాఖ్య పిలుపుపై ఈ ప్రదర్శనం జరిగింది. విద్యార్థినులు కోటీ నుంచి సచివాలయానికి ఊరేగింపుగా వెళ్ళి ప్రభుత్వానికి మెమోరాండం అందజేశారు. విద్యార్థినులకు ఆత్మరక్షణ కోసం కరాటే మున్నగు వ్యాయామ శిక్షణ నిర్బంధంగా ప్రతి విద్యా సంస్థలోను వుండాలని వారు కోరారు.

## శ్రీ కుమరయ్యకు కొత్త పదవి :

రాష్ట్ర హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఎస్. కుమరయ్య ప్రపంచబ్యాంకి అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్ న్యాయమూర్తిగా నియమితులయ్యారు. ఆయన జులై 15, 16 తేదీలలో లండన్‌లో జరిగిన ట్రిబ్యునల్ సమావేశాలలో పాల్గొనడానికి వెళ్ళారు. సెప్టెంబర్ మొదటి వారంలో ట్రిబ్యునల్ మరొక సమావేశం సెప్టెంబర్ మొదటి వారంలో వాషింగ్‌టన్‌లో జరుగుతుంది. శ్రీ కుమరయ్య ఈ నెల హైదరాబాద్‌లో విశ్రాంతి తీసుకుని వాషింగ్టన్ వెళ్ళతారు.

## సొంతపనులకు ప్రభుత్వ వాహనాలు :

రాష్ట్ర ప్రభుత్వాధికారులు ప్రభుత్వ వాహనాలను సొంత పనులకు వాడుకుంటారని ఇటీవల జరిగిన సర్వే వల్ల వెల్లడయింది. స్వంత పనులకు ప్రభుత్వ వాహనాలను వాడుకోరాదని 1962 అక్టోబర్ 31న ప్రభుత్వం ఉత్తరువు జారీచేసింది. అయినా దానిని ఎవరూ ఖాతరు చేయడం లేదు. ప్రభుత్వ వాహనాల సంఖ్య దాదాపు 6000. వాటిలో కార్లు, వ్యానులు, జీపులు ఉన్నాయి. ఒక్కొక్క దానికి సగటున రోజుకు కనీసం ఐదు లీటర్ల పెట్రోలు పడుతుంది. దానిలో అధికారుల సొంత పనికి కనీసం ఐదవ వంతయినా ఉంటుంది. రాష్ట్ర ప్రభుత్వ డ్రైవర్ల సంఖ్య దాదాపు ఎనిమిదివేలు. వీరు రోజుకు కనీసం తొమ్మిది గంటలు పనిచేస్తున్నారు. వీరి పని గంటలు మాత్రం ఆరున్నర. ఉదయం ఇంటినుంచి వెళ్ళిన డ్రైవరు ప్రొద్దు గూకిన తర్వాతగాని ఇల్లు చేరడు. కొందరు అధికారులేమో నిబంధనలను పాటించక వ్యయంగా కార్లు నడుపుతూ ప్రమాదాలకు గురిఅవుతున్నారు. అధికారులు ప్రభుత్వ వాహనాలను సొంత పనులకు వినియోగించుకొంటుండడం నిజమని రాష్ట్ర ప్రభుత్వ డ్రైవర్ల సంఘం అధ్యక్షుడు శ్రీ కె. ఎం. రసూల్ కూడా తెలిపారు. ప్రజలకు మార్గదర్శకులైన ప్రభుత్వాధికారులు, నాయకులు నియమాలు పాటించాలిగదా !



CHAITRA-G.120 TEL

# త్రివిధచర్యగల ట్రిలో నీలి డిటర్జెంట్ బిళ్ళ

## మరే ఇతర పేరెన్నికగన్న డిటర్జెంట్ బిళ్ళలకన్న 25% ధర తక్కువ




ట్రిలో నురగ ఎంతో బాగుగా నురుగు—గనక మీరు మరెన్నో బట్టలను ఉతికేవీలు. మరే ఇతర డిటర్జెంట్ బిళ్ళ కన్న ఎక్కువగా!

ట్రిలో మరెంతో బాగా ఉతుకుతుంది—బాగా మురికి పట్టేసిన మీ బట్టల్ని కూడా ఉతికే శక్తి గలది. మీ బట్టలు తెల్లగా, తాజాదనం ఉండేలా చేసేందుకుగాను నీలి మందు అమర్చబడింది!



ట్రిలో ఎంతో కాలం అది వస్తుంది—
ఇది ముద్దగా అయిపోదు గనక పూర్తిగా అరిగిపోయేదాకా వాడే వీలు.

త్రివిధ చర్యగల కొత్త ట్రిలో మరెంత మేలైనదో చూడండి!

గోద్రెజ్
ఉత్పాదన

## హైదరాబాద్ నోట్‌బుక్

శ్రీ అగర్వాల్ వివరణ :

అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన భారతీయ ఇంద్రజాలికుడు ప్రొఫెసర్ ఒ. పి. అగర్వాల్ 1983 నుండి ఇంద్రజాలిక వృత్తి నుంచి విరమిస్తున్నట్లు ఆగస్టు 2 న పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ప్రకటించారు. తన 33 వ ఏట ఇంద్రజాల ప్రదర్శనం ప్రారంభించానని 1983 నుంచి ప్రశాంతంగా జీవితం గడుప నున్నానని ఆయన అన్నారు. ఆయన రష్యాలో 40 రోజులపాటు పర్యటించి తమ ఇంద్రజాల నైపుణ్యం ప్రదర్శిస్తారు. భారత దేశానికి తిరిగి వచ్చిన పిదప ఒక మారు 1983లో ప్రదర్శన జరిపి విరమిస్తారు.

ఉపశ్రుతి :

పోలీసులు స్త్రీలపై మానభంగాలు, మొదలైన అత్యాచారాలు చేస్తున్నారని తరచు వార్తలు వస్తున్నాయిగదా. వీటిని నివారించడం ఎలా ?— అనడిగారు ఒకరు నన్ను. మానవత్వం పెరగాలి. నైతిక ప్రవర్తనను పాటించాలి అని ఏవేవో అంటున్నాను. అవన్నీ కుదరవండీ. అలనాడు రోమన్ చక్రవర్తి త రాజ్యంలోని వనితలకు చేస్టిటీ బెల్టులు (పాతివ్రత్య ఇనుపకచ్చడాలు) తగిలించినట్లు డ్యూటీలో ఉన్న పోలీసులకు చేస్టిటీ బెల్టులు తగిలిస్తే బాగుటుందండీ అన్నారు మిత్రులు శ్రీ మామిడి పూ కృష్ణమూర్తి. అవునవును. ఇంటి నుంచి డ్యూటీకి రాగానే తగిలించుకోడం, ఇంటికి వెళ్లేటప్పుడు స్టేషనులో అప్పగించి పోవడం మహా బాగుంటుం అన్నారు మరొక మిత్రులు.

—తిరుమల రామచంద్ర








**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Stree Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యంవిందే గట్టి పళ్ళు



# కోల్గేట్
## డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోమకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే అహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన అపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోము కోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన అహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన అహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

**నోటి దుర్వాసనను ఆపండి...**
**కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో**
**దంతక్షయాన్ని ఎదుర్కోండి!**




DC.G.74 TL

# మదిలో 'ప్రియ' మెదిలేదెప్పుడు?

## ఎల్ల వేళలా...

ఉదాహరణకు నలుగురూ కలిసే వేళ...

రుచులూరించే 'ప్రియ' ఎదురుగా ఉంటే గంటలు క్షణాల్లా గడిచి పోతాయి. వడ, ఇడ్లీ, పూరీ, సమోసా, కట్లెట్...ఏదైనా సరే - 'ప్రియ'తో జోడించండి. ఆ రుచి అమోఘం!

మామిడికాయ, నిమ్మకాయ, గోంగూర, అల్లం, టొమాటో... అన్నీ మీకు నచ్చే పచ్చళ్ళే. తెలుగు నేల నాలుగు చెరగులా గాలించి తెచ్చిన పళ్ళూ, కాయలకు తగుపాళ్ళలో నాణ్యమయిన మసాలా దినుసులు మేళవించి, అధునాతన కర్మాగారంలో, అత్యంత పరిశుభ్రమయిన వాతావరణంలో తయారుచేసిన పచ్చళ్ళివి.

మీకిష్టమయిన 'ప్రియ' పచ్చడిని ఈరోజే కొనండి. మీరు వెచ్చించే ప్రతిరూపాయికీ మించిన కమ్మదనాన్ని చవి చూడండి.

తయారుచేయువారు:
**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్
పోరంకి, కృష్ణాజిల్లా.



Marketed by
Margadarsi Marketing
PRIVATE LIMITED
Eenadu Compound,
Somajiguda,
Hyderabad-500 004.




ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ